# అబ్బాసీ కథలు

కె. ఎ. అబ్బాస్



# అబ్బాస్ కథలు

K. Satyanarayana 20.12.55

రచన : కె. ఎ. అబ్బాస్

అనువాదం : 'ర షి'



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# ఉడుగర

ఎన్నఁడో పిన్ననాఁడు దివి
కేగిన తండ్రికిమాఱు నేరుగా
కన్నుల వెన్నెలల్ గురిసి
కష్టసుఖమ్ము లెఱుంగనీక మ
మ్మెన్నోవిధాల సాఁకి నుతి
కెక్కిన అన్నపదమ్ములంటి యీ
చిన్నికృతిన్ సమర్పణము
సేతు నితోధిక భక్తియుక్తులన్.

"రవి"

# నా మాటలు

క్వాజా అహమ్మద్ అబ్బాస్ సాహిత్యరంగంలో చేయితిరిగిన వ్యక్తి. కథాసాహిత్యంలో అతడొక విశిష్ట స్థానాన్నాక్రమించాడు. అతడు వ్రాసిన 'సామ్రాజ్యవాదానికి నాలుగు స్తంభాలు' అనే కథ అమెరికా బహుమానాన్ని పొందింది. జన్మచేత మహమ్మదీయుడే అయినా అతనిలో మతసంకుచితత్వం కానరాదు. విశాలమైనభావాలు కలవాడు. అబ్బాస్‌మీదనుండే అభిమానంకొద్దీ, ఆంధ్ర పాఠకలోకానికి అబ్బాస్‌ను పరిచయం చేద్దామనే ఉబలాటం కొద్దీ నా అల్ప పరిజ్ఞానాన్నయినా పాటించకుండా యీ పని కుపక్రమించాను. ఇందులో ఏవైనా పొరపాట్లుంటే అవి అబ్బాస్‌కిమాత్రి మంటగట్టకండి. అవి నావి. అందుకై నన్ను క్షమించకండి. నిశితంగా విమర్శించండి. అదే నా రోగానికి మందు. సానబడితేనే వజ్రానికి కాంతి. ఉలి, సుత్తె తీసుకొంటేనే రాతిలో కళ లావిర్భవిస్తాయి. అలానే నిశితంగా విమర్శలకు గురిఅయినప్పుడే రచయిత నిగ్గు తేల్తాడు. ఇందులో అయిదు కథలున్నాయి. అవి ఇంగ్లీషులోనుండి, హిందీలోనుండి తర్జుమాచేయబడినవి. తర్జుమాచేయడములో నున్న సాధకబాధకాలను విచారించి మరీ విమర్శించమని నా ప్రార్థన.

సెలవు.

మీ

'రవి'

సంగం జాగర్లమూడి

# 1

## రాళ్లు - రక్తం

"అజంతా—ప్రపంచమున సాటిలేని మేటి కళాఖండము. భారతీయ సంస్కృతీ చిహ్నము—అంతరాత్మ, అసమాన శిల్ప భాండారము, ఈ శిల్పకళానైపుణ్యమునకు విదేశీయులు సైత మచ్చెరువొంది ముగ్ధులై ముక్కుమీద వ్రేలు వేసుకుంటున్నారు. వీటి నిర్మాణము పదిహేనువందల సంవత్సరములకు పూర్వం జరిగింది. ఈకొండకోనలలో అసంఖ్యాకములైన ఈ కళాఖండములను మలచడానికి, ఎనిమిదివందల సంవత్సరాలు పట్టింది. ఇదిగో అహింసామూర్తి బుద్ధ భగవానుని విగ్రహాన్ని ... ..."

ఇరువది ఎనిమిది రూపాయల జీతం—రెండు రూపాయల కరువుబత్తెం మీద నియుక్తుడైన 'గైడు' ఇలా రోజుకు వందపర్యాయాలు, తన మామూలు ధోరణిలో, అనుభవజ్ఞుడైన వక్తలా, గ్రామఫోను రికార్డులా, అజంతా గుహాలను చూడటానికి వచ్చే యాత్రీకులకు వ్యాఖ్యానిస్తూ వుంటాడు.

ఫుల్‌స్టాపులు, కామాలు, జీవం, ఆత్మ లేని యీ 'గైడు' సొదంతా సోదిలా కనిపించింది నిర్మల్‌కుమార్‌కు.

కాని భారతి కళోపాసకురాలు, చిత్రకారిణి కావడం చేత గైడుచెప్పే వ్యాఖ్యానం తదేకధ్యానంతో చెవులప్ప గించి వింటున్నది. ఆమె తన్మయత్వమున ఆ ప్రాచీన కళా తరంగిణిలో మునకలువేస్తున్నది. ప్రతిశిల్పం, ప్రతి చిత్తరువు, ప్రతి లత ఆమెను ఆనందసాగరమున ఓలలాడిస్తున్నవి. 'ఇదిగో నిర్మల్! ఇలాచూడు. ఈ అప్సరస విగ్రహ మెంత బాగున్నదో చూడు, ముద్దులు మూటగట్టుతున్నది. చిరునవ్వు వెన్నెల లొలకబోస్తున్న యీ బుద్ధభగవానుని చూడు. ఆహో... ఏమి సౌందర్యము... ఏమి నైపుణ్యము!'

నిర్మల్‌కుమార్ మనస్సంతా అర్థంలేని, మసక మసకగానున్న రంగులమీద లగ్నమైవున్నది. అందుచే అతడు ఎంతో ఆప్యాయంగా భారతి చెపుతున్న మాటలను గాని, తన మామూలు ధోరణిలో గైడు వెళ్ళబోస్తున్న సొదనుగాని వినిపించుకోలేదు. అతని దృష్టిలో ఒక శిల్పం బాగుగాను, మరొకటి వోగుగాను కనిపించడములేదు.

గైడుయొక్క అర్థంలేని ఊకదంపుడు ముందుకు సాగి పోతూనే వున్నది. 'ఇదిగో యీ చిత్తరువును చూడండి. బుద్ధుని రాగోదయం. ఇదిగో యిక్కడ బుద్ధ భగవానుడు శిష్యులకు తత్వోపదేశం చేస్తున్నాడు. ఇదిగో యిది రాజ నర్తకి. భగవానుని ఉపదేశంవింటూ దర్బారుకు పోవడంలో ఆలస్యం చేసింది. ఆలస్యానికి కారణం తెలిసికొని రాజు బుద్ధ భగవానుని సమీపించి 'ఎవరునీవు? నీవు బోధిస్తున్న దేమిటి?' అని ప్రశ్నించాడు. 'సత్యాహింసలు' అని భగవానుడు జవాబు చెప్పినాడు. రాజుకుకోపంవచ్చి తలారిని పిలిపించి

యితని కాళ్ళూ, చేతులు ఖండించమని ఆజ్ఞాపించాడు. తలారి కత్తి ఎత్తగానే పూలహారమై భగవానుని మెడలో పడింది. 'సత్యాహింసలు నాహృదయంలో వున్నవి గాని, కాళ్ళూ, చేతులలో గాదు' అన్నాడు భగవాన్. ఇదిగో యిక్కడ యీ గాయాలలో నుండి స్రవిస్తున్న రక్తం చూడండి...'

'రక్తం!'

ఈమాట నిర్మల్‌లో ఏవోభావాలను రేకెత్తించింది.

గైడు ఊకదంపుడులోని యీ ఒక్క ముక్క నిర్మల్ కుమార్ మస్తిష్కానికి సుత్తిదెబ్బలా తగిలింది. అతనిహృదయాన్ని కలతబెట్టింది.

రక్తం!

అతనితల తిరగసాగింది. అజంతాశిల్పాలు, స్తంభాలు గుహాలు, అన్నీ గిర్రున తిరిగిపోతున్నాయి. భారతిగాని, గైడుగాని, దుర్మార్గుడైన కాశీరాజుగాని, పచ్చని లోయగాని, అతని కేమీ కన్పించడములేదు. అంతాగిర్రునతిరిగిపోతున్నది.

రక్తం!

రక్తపు సెలయేళ్ళు, రక్తనదులు, రక్తసముద్రం, ఈ రక్త తరంగాలు నిర్మల్‌ని తిరిగి బొంబాయి తీసుకొని పోతున్నాయి. ఏరక్తప్రవాహాలనుండి తప్పించుకోవడానికై మూడువందల మైళ్ళు, పదిహేనువందల సంవత్సరాల దూరమునున్న యీ అజంతా గుహాలకు వచ్చాడో, తిరిగి ఆ రక్త ప్రవాహమే అతనిని యథాస్థానానికి తీసుకొనిపోతున్నది.

♦ ♦ ♦

సెప్టెంబరు ఒకటవ తారీఖున నిర్మల్ తన ఆఫీసుపని ముగించుకొని గిర్గామ్‌లోనున్న వసంత్ ఆఫీసుకు వెళ్ళాడు. అక్కడనుండి వారిరువురూ కలిసి షికారుకు వెళ్ళడం మామూలు. ఇంతలో ఎవరో బయటనుండి పరుగెత్తుకుంటూ వచ్చి నగరంలో గలాటాలు బయలుదేరినవనే కబురు తెచ్చారు. కలాలూ, కాగితాలూ క్రిందబెట్టి అందరూ ఆ విషయం చర్చించసాగారు.

'ఏమీ భయంలేదు. గవర్నమెంటువారు కొద్దిగంటల లోనే యీ గలాటాల నణచివేస్తారు. అందుకు తగినబందో బస్తు వారిదివరకే చేశారు.'

'అసలీగలాటాలు ఎలా బయలుదేరినవంటే – రేపు ముస్లింలీగు నల్లజండాల ప్రదర్శనం జరపాలనుకొన్నదట.'

'కలకత్తాలోజరిగిన కొట్లాటలకుకూడా యిదేకారణం'

'పోలీసులు ప్రయివేటు వ్యక్తులవద్దనున్న ఆయుధాల నన్నింటిని వశపర్చుకొంటున్నారట.'

'గోల్‌పిఠాలో ఎవడో ఒక ముస్లిం ఒక కాంగ్రెసు భక్తునిమెడలో చెప్పులదండ వేయడానికి ప్రయత్నించాడట'

'భయపడకండి. ఇలాంటి సమయంలో హిందువు లంతా చేతులు ముడుచుకొని కూర్చోరు,'

ఇంతలో వీధిలో అంబులెన్సుకారు మోత వినిపించి, అందరూ కిటికీవద్దకు పరుగెత్తారు. ఆ అంబులెన్సు గాయాలు తగిలినవారిని హరికిషన్‌దాస్ ఆస్పత్రికి చేరవేస్తున్నది. మురికిధోవతి కట్టుకొని, మహారాష్ట్రిటోపీ పెట్టుకొన్న పొట్టి, లావుపాటిమనిషి హాస్పిటల్‌గేటువద్దకుపోయి 'ఇప్పుడు అంబు

టెన్సులో వచ్చినది హిందువులా? లేక ముస్లిములా?' అని వాచ్‌మాన్‌ని అడిగాడు. కారు లోపలకు పోయినతరువాత యధాప్రకారంగా గేటువేస్తూ 'ఇద్దరు హిందువులు, ఒక ముస్లిం' అని జవాబుచెప్పాడు వాచ్‌మాన్. ఈమాటలువిని ఎదురుగా హిందూహోటలుముందు నిలబడివున్నవా రంతా ఏదో గొణుగుకొన్నారు.

చారిణీ రోడ్డులోనున్న అన్నిదుకాణాలు మూసివేశారు. హిందూహోటలుగూడా బజారుగేటుమాత్రం కొద్దిగా తెరచివుంచి మిగతావాకిళ్ళన్నీ బిగించుకొన్నది. ఒక్కబస్సు గాని, ట్రామ్‌గాని నడవటంలేదు. బజారంతా నిర్మానుష్యంగా వున్నది. ప్రజలంతా మేడలమీదినుండి కిటికీలగుండా, బజారులో జరిగే దృశ్యాలను విచారంగా చూస్తున్నారు. వాళ్లు చక్కగా బిగించిన నగారాలాగున్నది పరిస్థితి. ఇలా కదిపితేచాలు... ప్రశాంత వాతావరణం అంతా భగ్నమౌతుంది.

ఇంతలో సాంధర్ట్సు రోడ్డువైపు అడుగులచప్పుడు వినిపించింది. అప్రయిత్నంగా అందరిచూపులూ ఆవైపుకు తిరిగాయి. ఒక బక్కపలచని యువకుడు పైజమా తొడుక్కొని విచారసూచిత వదనంతో నగరంలో జరుగుతున్న రక్తపాతాన్ని చూచుకొంటూ వస్తున్నాడు.

హిందూహోటలుముందున్న వారిలో ఒకడు 'చూడండి ఈ...కొడుకు, ఇది తన బెండీబజారైనట్లు ఎంత ధీమాగా వస్తున్నాడో' అన్నాడు. వెంటనే మురికిధోవతి కట్టుకొని, మహారాష్ట్రటోపీ పెట్టుకొన్న పొట్టి, లావాటి వ్యక్తి తనచొక్కాక్రిందకు చేయిపోనిచ్చి దేనికో వెదుకు

తున్నాడు. ఆయువకుడిప్పుడు వసంత్ ఆఫీసుదగ్గరకువచ్చాడు. కిటికీవద్ద నిలచిన నిర్మల్‌కు ఆయువకుడు స్పష్టంగా కనిపిస్తు న్నాడు. మజ్లిన్ లాల్చీలోనుండి అతనిబొమికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎవరో విద్యార్థో, లేక క్లర్కో అని ఊహించాడు నిర్మల్. నిర్మల్‌కు భయమేసింది. అతనికి హెచ్చరికచేయాలనుకొన్నాడు. 'అరే భాయీ! ముందుకు పోవద్దు. పోతే అపాయము' అతనిమాట పూర్తికానేలేదు. కత్తి తళుక్కుని మెరపులా మెరసి, ఆయువకుని వక్షస్థలాన్ని దూసుకుపోయింది.పాప మాయువకుడు దీనంగాచూస్తూ చేతు లడ్డుపెట్టబోయాడు. కాని నిష్ప్రయోజనం. 'అరే...భగ వాన్'అంటూ భూమికొరిగాడు.

'పాపమెవరో హిందువులాగున్నాడు' అన్నాడొకడు.

'నీకు తెలియదురా, ఈ...దొంగెత్తు వేస్తున్నాడు.' అన్నాడు మరొకడు.

'హిందువైతే పైజమా వేస్తాడటరా?' అన్నా డింకొకడు.

'పైజమా విప్పితే తేలిపోతుంది' అన్నా డింకొకడు.

ఆకత్తి అతని శరీరములో గ్రుచ్చుకొని యింకా అలానేఉన్నది. దానిని గురించి విచారమెవ్వరికీ లేదు.కొంత మంది అతనివద్దకు పోయి పైజమాముడి విప్పారు.

నిర్మల్ సిగ్గుతో తలవంచుకొన్నాడు. అతను తల యెత్తి చూచేసరికి పరీక్షపూర్తయినది. పొట్టి, లావుపాటి మనిషి కనులలో నీరుపెట్టుకొని, కత్తి బయటకులాగుతూ

'పొరపాటు జరిగింది' అంటూ కత్తికయిన రక్తాన్ని తనధోవతికి తుడుచుకొన్నాడు.

కత్తిబయటకు లాగగానే ఆ గాయమునుండి రక్తం సెలయేరులా ప్రవహించడం నిర్మల్ చూచాడు. నల్లని... ఎర్రని...రక్తం! మానవరక్తం!! విలువలేకుండా భూమిపై ప్రవహించి పంకిలము చేస్తున్నది.

రక్తం!

ప్రశాంతమైన యీ అజంతా గుహలలో గూడా రక్తపాతాన్ని, ఈర్ష్యను, ద్వేషాన్ని తలచుకొంటూ నిర్మల్ ఎంతసేపు మైమరచి వున్నాడో చెప్పలేము. భారతి తన మృదులహస్తాన్ని అతని భుజముమీదవైచి 'చూడు నిర్మల్' అనేసరికి అతను ప్రకృతిస్థుడై 'ఏమంటావ్ ? భారతీ !' అన్నాడు.

'ఏమీలేదు నిర్మల్! బొంబాయి, కలకత్తా నగరాలలో జరిగిన రక్తపాతానికి దూరంగా - చాలా దూరంగా- వందలమైళ్ళ దూరంగా — వేల సంవత్సరాల దూరంగా యీ ప్రశాంతమైన గృహాలలో వుంటే నీ వా దృశ్యాలన్నీ మరచిపోతావని...'

భారతి కళాపోషకురాలు. చిత్రకారిణి—కాని ఎంత అమాయకంగా నిర్మల్‌ని విసిగిస్తున్నది. అతని హృదయం బాధపడడం చూడలేనంతగా ప్రేమించిందతనిని. అల్లరులు బయలుదేరినవనగానే ఆమె గాభరాపడింది—నిర్మల్ సున్నితమైన హృదయం ఆ దృశ్యాలనుచూచి భరించలేదని. చారిణీ రోడ్డులో జరిగిన ఘోరదురంతాన్ని చూచి నిర్మల్

రెండు మూడురోజులు నిద్రాహారాలు మానివేశాడు. అతని మనస్సు చీకాకుపడింది. ఈ సంగతి ఇతరులెక్కడ గ్రహించిపోతారో అని చాలా బాధపడ్డాడు. భారతి ఎదుట మాత్రం తన హృదయంలోని బాధను బయటబెట్టకుండా ఉండలేకపోయేవాడు. 'చూడు భారతీ! నాకింకా ఆ బక్క పలచని యువకుడు దీనంగాచూస్తూ రక్షించమని చేతులడ్డు పెట్టడం కన్నులకు కట్టినట్లు కానవస్తున్నది. అతని ఆర్త నాదం చెవులలో యిప్పటికీ ప్రతిధ్వనిస్తున్నది. అతను రక్త సముద్రములోపడి మునిగిపోతున్నట్లు, నేనేమీ చేయ లేని నిస్సహాయుడనైనట్లు,కండ్లుమూసినా తెరచినా నాఎదుట ప్రత్యక్షమాతున్నది.'

భారతి తన చల్లని హస్తంతో అతని తలవెంట్రు కలను నిమురుతూ 'పాపం' అని మాత్రం అనగలిగింది. ఆమె యెంతగానో అతని పరిస్థితిని చక్కదిద్దజూచింది. సినిమా, రేడియో, నాటకాలు, సంగీతం ఆఖరికి భారతి మృదుమధురమైన వాక్కులు గూడా అతనిమీద పనిచేయ లేకపోయాయి. అతని హృదయానికి తగిలిన గాయాన్ని మాన్పలేకపోయాయి. ఒక్కసారిగా నిర్మల్ తన ఆలోచ నలను, చురుకుదనాన్ని చాతుర్యాన్ని కోలుపోయాడు. రోజూ మామూలు ప్రకారం భారతిని చూడడానికి వస్తాడు. కాని మాటా, పలుకూ లేకుండా గంటలతరబడి శూన్యం లోకి చూస్తూ అలా కూర్చుంటాడు.

'నిర్మల్! నీహృదయం గాయపడిందని నాకు తెలుసు. చారిణీ రోడ్డులో జరిగిన దురంతాలు హృదయవిదారకమైనవే

కాని ఎల్లప్పుడూ వాటినే తలచుకొంటూ బాధ పడేకంటె వాటిని మరచిపోవటానికి ప్రయత్నించడం.........'

'మరచిపోవడం మంచిదే, కాని మరచిపోవడ మెలా భారతీ?'

నిర్మల్ కవి, కధకుడు, నవలాకారుడు, నాటకకర్త. అతని పద్యాలు, వ్యాసాలు, కథలు అన్ని ప్రముఖ పత్రికల లోనూ ప్రచురింపబడుతూనే వున్నవి. భారతి ఒక కోటీశ్వ రుని కూతురు. కళారాధకురాలు- నిర్మల్ రచనలంటే చెవి కోసుకుంటుంది. ఈర్ష్య, ద్వేషం, రక్తప్రవాహాలకుదూరంగా ప్రశాంతమైన ఏదో కొండమీద యిల్లుగట్టుకొని నిర్మల్‌తో హాయిగా కాలం గడపాలని ఆమెకోరిక. ఉత్తమ సాహి త్యాన్ని సృష్టించగలిగిన నిర్మల్, యిలా పత్రికా విలేఖరిగా జీవితం గడపడం ఆమెకిష్టంలేదు. కాని బ్రతుకు దెరువుకొరకు విలేఖరివృత్తి నవలంబించినా, అందులోగూడా సాహిత్యసేవ చేసే అవకాశం లేకపోలేదని నిర్మల్ వాదన. పైగా జీవి తాన్ని అన్నికోణాలనుండీ చూడగలిగే అవకాశ మున్నది విలేఖరివృత్తిలో. పోలీసుస్టేషనులలో, సమ్మెలలో, కోర్టులలో మీటింగులలో న్యాయముఎంతవరకున్నదో గమనించవచ్చు. విలేఖరిగా అతను కర్ఫ్యూ వున్నప్పుడుగూడా పోలీసు 'వేన్' లో నగరమంతా తిరిగాడు సాంఢర్టురోడ్డు, బెండీబజార్—, పైధోని-, బైకుల్లా- పరేల్ - దాదర్- మాతుంగా......

బొంబాయి అట్టుడికినట్లు ఉడికిపోతోంది. కత్తిపోట్లు, హత్యలు సర్వసాధారణమైపోయాయి. ఇక్కడ ఒక రొట్టెల సాహేబును చంపారనో, అక్కడ ఒక హిందూ పాలమనిషిని

చంపారనో, ఇక్కడొక పఠానును చంపారనో, అక్కడొక పది సంవత్సరాల కుర్రవాడిని గొంతుకోశారనో-యిలా నగరమంతా పుకార్లు బయలుదేరాయి. నగరం రెండుభాగాలుగా విడిపోయింది- 'హిందూ బొంబే-ముస్లిం బొంబే.' ఏ మహమ్మదీయుడైనా పొరపాటున పైధోనీలో అడుగుపెట్టాడా; కత్తిపోటుకు గురి అయినాడన్నమాటే! ఏ హిందువైనా బెండీ బజారుకు పోయాడా, నెత్తురు కక్కినాడన్నమాటే! ఈ విధంగా పాకిస్థాన్, అఖండ హిందుస్థాన్‌లను సాధించగలిగారు.

నిర్మల్ నిత్యమూ మిలటరీలారీలో నగరమంతా తిరుగుతూనే వున్నాడు. ఒకనాడొక తెల్ల సార్జంటు నిర్మల్‌తో యిలా అన్నాడు. 'మీ కాంగ్రెసువారు పాకిస్థాన్ విభజన కంగీకరించరు. కాని యీనాడు బొంబాయిలో పాకిస్థాన్ ఏర్పడిందా, లేదా?' అన్నాడు. మరునాడు ఇంకొక తెల్ల సిపాయి నిర్మల్‌తో 'మీరంతా ఏకంగా క్విట్ యిండియా, క్విట్ యిండియా'అని తెగ అరిచారు. మేమిప్పుడు ఇండియా వదలి వెళ్ళడానికి సిద్ధంగా వున్నాము. కాని తిరిగి మీరంతా బ్రతిమాలుతూ ఎందుకు మా వెంటబడుతున్నారు? మీ బాయ్‌నెట్లతో హిందువులనుండి రక్షించమని మహమ్మదీయులు, మహమ్మదీయులనుండి రక్షించమని హిందువులూ మొరబెట్టుకొంటూ ఎందుకు మా వెంటబడుతున్నారు? ఈనాడు మేమే దిక్కయినాము. అందుకే తిరిగి యీనాడు మీరే 'ఇండియా విడిచిపోవద్దు' అంటున్నారు' అన్నాడు.

ఎన్నో త్యాగాలుచేసి, కలలుగని, కష్టపడి సంపాదించుకొన్న స్వాతంత్ర్యం పేకమేడలా ఒక్కసారి కూలిపోతున్నట్లు

అనిపించింది నిర్మల్‌కు.

1857 సిపాయీల తిరుగుబాటు——

బెంగాలు విభజన——

నాన్‌కోపరేషన్...ఖిలాఫత్ ఉద్యమం......విదేశ వస్త్రబహిష్కారం...గాంధీ-ఆలీసోదరులు— జలియన్‌వాలా బాగ్ దురంతాలు...స్వాతంత్ర్యపోరాటములో హిందూ ముస్లిం రక్త ప్రవాహాలు...భగత్‌సింగ్... సత్యాగ్రహం ...సహాయ నిరాకరణం...రావీనదియొద్ద జండా ప్రతిష్ఠాపన ...జాతీయగీతాలు......

ఇండియాఐక్యత, గౌరవం, సంస్కృతి, సంగీతం, సాహిత్యం, కళ, కవిత్వం, పేరుప్రతిష్టలు-అన్నీ బూడిదలో పోసిన పన్నీరేనా......?

అన్నీ మట్టిలో కలిసిపోయినవి. కాని, యుగయుగాలు మట్టిలోవున్నా కాంతిచెడని బంగారంలా, అజంతా మాత్రం నేటికీ భారతీయ సంస్కృతీచిహ్నముగ, ఆత్మగా నిలచి యున్నదని భావించింది భారతి.

కాని నిర్మల్‌మాత్రం చీకటిగానున్న ఆ గుహలో గైడు టార్చిలైటు వెలుతురులో మసకమసకగా కనిపిస్తున్న ఆరంగులనుతప్ప,ఆశిల్పాలలో,చిత్తరువులలోవున్న అందాన్ని గాని, అర్థాన్నిగాని,సందేశాన్నిగానిగ్రహించలేకపోయాడు. పైగా సాధ్యమైతే ప్రపంచాన్ని ఇలా ప్రశ్నించాలనుకొన్నాడు. 'ఏమిటిదంతా? ఈ శిల్పాలు! ఈ చెక్కడాలు!! యీ చిత్తరువులు !!! యీ కళ ఎందుకు? దేనికొరకు? కాలాన్ని, మానవశక్తిని, విలువ తెలిసికొనకుండా, వృథా

వ్యయం చేశారు. అనంతమైన మానవపరిణామ సిద్ధాంత ములో యిది ఒక అర్థంలేని వ్యర్థప్రయత్నం. ఇలా కాలాన్ని శక్తిని, ఈశిల్పాలు మలచడానికి వినియోగించేకంటే మానవ కళ్యాణానికి మానవుల్లో మానవత్వాన్ని నెలకొల్పడానికి వినియోగించి వున్నట్లయితే యీనాడిన్ని హత్యాకాండలు యింత రక్తపాతం జరిగేది కాదు. మానవులు పశుప్రవృత్తికి దిగి రక్తదాహంగొన్న జంతువుల్లాగ, యిలా పోరాడుకొనే వారు కారు. తప్పించుకు తిరుగువాడె ధన్యుడు' అనే పిరికి మంత్రాన్నితప్ప, అజంతానుండి మానవులు నేర్చుకొనే దేమీలేదు. సత్యాన్నుండి, ప్రపంచాన్నుండి, జీవితాన్నుండి తప్పించుకు పారిపొండని ప్రబోధిస్తున్నవి. అజంతా వట్టి వ్యర్థపుపనే కాకుండా పెద్ద అబద్ధం, ఫోర్జరీ—'

గైడు తనపని తాను సాగించుకుపోతూనే వున్నాడు. 'ఇదిగో యీ చిత్రాన్నిచూడండి. బుద్ధభగవానుడు గుర్రాన్నెక్కి, ఇదిగో వీధులవెంట ఊరేగుతున్నాడు—ఇదిగో, ఈ స్త్రీ మూర్తిని చూడండి – తనకు పుత్రభిక్ష పెట్టమని భగవానుని ప్రార్థిస్తున్నది ...'

'నిర్మల్! ఇదిగో యీ స్త్రీమూర్తులను చూడు. అజంతా శిల్పులు భారతీయ స్త్రీజాతియొక్క సహనాన్ని త్యాగాన్ని, మార్దవాన్ని, మనోజ్ఞతను, మాతృత్వాన్ని చక్కగా అర్థంచేసికొని, యీ కళాఖండాలను మలచినారు' అన్నది భారతి.

స్త్రీల సహనం, త్యాగం, మార్దవం, మనోజ్ఞత, మాతృత్వము–ఈమాటలు వినేసరికి నిర్మల్‌కు గుహాలన్నీ

ప్రతి ధ్వనించేలా నవ్వాలనిపించింది... అంతా మోసం... మాయ... అబద్ధం... ఆత్మవంచన...

*  *  *

నిర్మల్ కమ్యూనిష్టుకాడు. కనీసం సానుభూతి పరుడైనా కాదు. ఒకనాడు పార్టీ సెక్రటరీతో పనివుండి పార్టీ ఆఫీసుకు వెళ్ళాడు. ఇంతలో రోడ్డుమీద గోల వినిపించి అందరూ కిటికీలవద్దకు చేరారు. నిర్మల్ కిటికీలోనుండి బయటకు చూచేసరికి ఒక గడ్డంసాహేబు రక్తంలోపడి తన్నుకుంటున్నాడు. అతని వెన్నుమీద కత్తిపోటున్నది. అతని గడ్డం రక్తంలో తడిసి చిరుగాలితరగలచే రెపరెపలాడుతున్నది. కొంతమంది హిందూస్త్రీలు అవతల మేడమీద నిలచి కిలకిలలాడుతూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుకొంటున్నారు..

'చూడు కమలా! అతనిగడ్డం రక్తంతో తడిచేసరికి ఎర్రగా దొండపండులా మారింది' అని ఒకామె అనేసరికి మిగతా వారంతా గొల్లున నవ్వారు.

స్త్రీల సహనం, త్యాగం, మార్దవం, మనోజ్ఞత, మాతృత్వం...

ఇంతలో అంబులెన్సువచ్చి ఆ గడ్డంసాహేబును ఆస్పత్రికి తీసికొనిపోయింది. వెంటనే ఒకామె బొక్కెనతో నీళ్లుతెచ్చి ఆ రక్తపు మడుగుమీద క్రుమ్మరించింది. రక్తం నీళ్ళవెంట కొట్టుకొనిపోయినా మరకమాత్రం రోడ్డునంటిపట్టుకొని అలానే వున్నది.

చాలా రోజులవరకు ఆ నవ్వు నిర్మల్ చెవులలో ప్రతిధ్వనిస్తూనే వున్నది. అతని గడ్డం రక్తంలో తడిసి, గాలికి రెపరెపలాడటం కనులకు కనిపిస్తూనే వున్నది. ఈ ఘోర దురంతానికి విలపించడానికి మారుగా, స్త్రీ జాతి అంతా గొల్లున అమాయకంగా, అజ్ఞానంగా నవ్వుతున్నట్లనిపించింది అతనికి. స్త్రీల సహనం, త్యాగం, మార్దవం, మనోజ్ఞత, మాతృత్వం...

నిర్మల్ స్నేహితులలో చాలామంది మహమ్మదీయులే. గలాటాలు జరుగుతున్న రోజులలో వారినెవరినీ కలుసుకోవటానికి వీలులేకపోయింది. ఒకనాడు హఠాత్తుగా తన స్నేహితుడు, తోటివిలేఖరి హనీఫ్ మలేరియాతో బాధపడుతున్నాడనివిన్నాడు. హనీఫ్ బ్రహ్మచారిఅనీ, అతనిని చూచే మరొక దిక్కులేదనీ నిర్మల్‌కు తెలుసు. ఉండబట్టలేక అతనికి సాయపడడానికై బెండీబజారుకు పోవ నిశ్చయించుకొన్నాడు.

క్రాఫర్ మార్కెట్టువద్ద హిందూప్రయాణీకులంతా బస్సు దిగిపోయారు. నిర్మల్ సూటువేసుకొని బయలుదేరాడు. ఎవరూ? యితను హిందువా? లేక ముస్లిమా? అని గుర్తించలేనట్లుగా తయారయాడు. ఎప్పుడైతే బస్సు పాకిస్థాన్ పొలిమేరలలో ప్రవేశించిందో భయంతో నిర్మల్ హృదయం కొట్టుకోసాగిది. తన ప్రక్కనే కూర్చుని గూండా చూపులు చూస్తున్న బోడితలముస్లిం తనమెదలోనిరొదవిని పవిత్రమైన మన ముస్లిం రాజ్యంలోకి యీ కాఫర్ ముండాకొడుకెవడో కాలుపెట్టాడంటూ గోలచేస్తాడేమోనని భయ

పడ్డాడు. అతనికత్తి తనశరీరాన్ని దూసుకుపోతున్నట్లు వెన్నె ముకవెంట జరజరలాడుతున్నట్లు తలపోశాడు.

జె. జె. హాస్పిటలువద్ద బస్సు దిగగానే అక్కడున్న ప్రయాణీకులంతా తనను పొడవడానికి వచ్చారని భావించాడు. చాకుతో నారింజకాయలు చీల్చి అమ్ముకొంటున్న కుర్రవానినిచూచి, అతడా చాకుతో హిందువుల చర్మాలను మాత్రి మెందుకు వొలవడనుకొన్నాడు. బహుశా ఆ కనిపించే పఠాను ఒక్క కాఫరునైనా చంపి స్వర్గానికి పోవాలనుకొంటున్నాడు. అడుగుల చప్పుడు విని వెనుదిరిగి చూచే సరికి ముసుగువైచుకొని ఒకస్త్రీ తనవైపుకే వస్తున్నట్లు కనిపించింది. స్త్రీయేకదాఅని గుండె దిట్టపరచుకొన్నాడు. కాని మరుక్షణమే ఎవరైనా గూండా యిలా ప్రచ్ఛన్నవేషంలో ఎందుకు రాకూడదనుకొన్నాడు. ఈమాట తలచుకొనేసరికి అతనికి ఒడలంతా చెమటలు పోసినవి. తప్పటడుగులు వేసుకొంటూ ఎలానో స్నేహితుడి గదికి చేరాడు.

హనీఫ్ మూలుగుతూ పడుకొని వున్నాడు. నిర్మల్ ఆ రోజంతా అతనివద్దనే ఉండాలనుకొన్నాడు. అతనికి జ్వరం తగ్గి కాస్త కాఫీయో,పాలో త్రాగినతరువాత ఇంటికి పోదామని నిశ్చయించుకున్నాడు. ఇంతలో ఒకపోలీసుసైకిలుమీద మాగఫోనుద్వారా 'అయిదు గంటలనుండి యిరువదినాలుగు గంటలు నగరంలో కర్ఫ్యూ ప్రివేశపెట్టబడింది. రాత్రిపూట ఆయుధాలు ధరించి ఎవరూ బయట తిరుగగూడదు. మిలిటరీ గస్తీ తిరుగుతున్నది. అలా బయట కనిపించినవారిని కాల్చి పారవేస్తుంది' అని అరవడం వినిపించింది. అయిదుగంటలకు

పదినిమిషాలు తక్కువ. ఈపదినిముషాలలో అతను శివాజీ పార్కుకు పోవడము అసంభవం. ఆకారణంగా ఆరాత్రి అక్కడే గడపదలిచాడు.

హనీఫ్ గది రోడ్డువైపుకున్నది. గదికిటికీ తెరిస్తే రోడ్డుమీదజరిగే దృశ్యాలు చూడవచ్చు. కర్ఫ్యూ ఆర్డరు విని ప్రతివారూ త్వర త్వరగా యిండ్లకు చేరుకొంటున్నారు. ఒక మనిషి భుజాన పాలకావిడి పెట్టుకొని భయంతో వణకుతూ పోవడం కనిపించింది నిర్మల్‌కు. ఆతడెవరో హిందువని గ్రహించాడు నిర్మల్. భుజానవున్న బరువు; లోపలిభయం అతనిని కృంగదీస్తున్నాయి. ఒక్కసారిగా చారిణీ రోడ్డుమీద జరిగినదృశ్యం దృష్టికివచ్చింది నిర్మల్‌కు. ఆపాలమనిషికి హెచ్చరిక చేయాలనుకొన్నాడు. 'అరే! బాయీ! ముందుకు పోవద్దు, పోతే ప్రమాదం—' అతనిమాట పూర్తికాకముందే ముగ్గురు గూండాలు కత్తులతో అతనినిచుట్టుముట్టారు. ఏయ్! కాఫర్ ఎక్కడికిపోతావ్'? అన్నారు.

అతనేమీ మాట్లాడలేదు. మాట్లాడినా ప్రయోజనం లేదని అతనికి తెలుసు. ఏమిచెప్పినా వారు తనను ప్రాణాలతో విడిచిపెట్టరనుకున్నాడు. ఆ ముగ్గురు గూండాల క్రూరమైన దృష్టులలో నిలిచి మృత్యుదేవత కరాలుచాచి తన నాహ్వానిస్తున్నట్లు భావించాడు. వెనుదిరిగి పారిపోదామన్నా వీలులేకుండా వెనక మరికొంతమంది కాచుకొని వున్నారు.

నిర్మల్‌కి వేట అంటే సుతరామూ యిష్టంలేదు. కాని యీనాడతను వేటాడబడిన లేడిచూపు ఎలాగుంటాయో చూడగలిగాడు. ఆ పాలమనిషి వారివంక దీనంగా చూస్తూ

పరిక్కకి తప్పుకోబోయాడు. రక్తసిక్త హస్తాలు అతనిని వెన్నంటాయి. మరో క్షణంలో పాలమనిషి రోడ్డుమీద వొరిగిపోయాడు. పాలకడవలు రెండూ చప్పుడు చేసుకొంటూ రోడ్డు క్రిందికి దొర్లిపోయాయి. పాలూ, రక్తం కలిసి రోడ్డు మీద సెలయేరులా ప్రవహిస్తున్నది.

'కాఫర్ పారిపోవాలనుకున్నాడు...'

ఎదుటి మేడమీద స్త్రీల కిలకిలలు, నవ్వులు వినిపించినవి.

'హే! గుల్బానా! త్వరగా యిటురా, ఇక్కడ మన వాళ్ళు ఒక కాఫరు ముండాకొడుకుని చంపారు. చూతువు గాని త్వరగా రా'

గొల్లున నవ్వు...

'అవతలికి యీడ్వండి — గాడిద కొడుకుని, రోజూ పాలల్లో నీళ్ళు గలిపి అమ్ముతున్నాడు. ఇవ్వాళ బాగా ప్రతీకారం జరిగింది.'

'గిర్‌గాంలో మన మహమ్మదీయులను చంపినదానికి ప్రతీకార మిది. బెండీ బజారుకువస్తే ఒక్క కాఫరు ముండా కొడుకుని గూడా విడిచిపెట్టరాదు.'

ఒకామె బుట్టతో కోడిగుడ్ల డొల్లలు, అరటికాయ తోళ్లు, బొమికలు బుట్టతో తెచ్చి, ఆ రక్తపు మడుగుమీద పోసింది.

స్త్రీల సహనం, త్యాగం, మార్దవం, మనోజ్ఞత, మాతృత్వం—?

చారిణీ రోడ్డులో హిందూస్త్రీలు, బెండీ బజారులో మహమ్మదీయ స్త్రీలు యికిలించిన యికిలింపులు, సకిలించిన సకిలింపులు అతనికి రాత్రింబవళ్లు వినిపిస్తూనే వున్నవి. వాటి ప్రతిధ్వనే అతనికి అజంతా గుహలలో గూడా వినిపిస్తున్నది. ప్రతి అప్సరస, ప్రతి స్త్రీమూర్తి అర్థంలేకుండా యికిలిస్తున్నట్లనిపించిం దతనికి. విషాదచ్ఛాయలు అతనిహృదయసీమనాక్రమించాయి.

స్త్రీజాతి అంటేనే అసహ్యం కలుగుతున్నది. భారతి-తనను మనసార ప్రేమించిన భారతి, తాను ప్రేమించినభారతి అంటేగూడా అసహ్యం కలుగుతున్నది.

హత్యాకాండలనుండి, రక్తపాతాన్నుండి తప్పించడానికే భారతి నిర్మల్‌ని యిక్కడకు తీసికొని వచ్చింది. తాను ప్రేమించిన నిర్మల్ కొరకు భారతి సర్వం త్యాగంచేయడానికి సిద్ధముగా నున్నది.

ప్రేమ! ప్రేమ! ! నిర్మల్‌కి నవ్వువచ్చింది. ప్రేమ, ద్వేషం—ద్వేషం ప్రేమ, ప్రేమ ఈర్ష్య, ఈర్ష్య ప్రేమ.

మనమంతా భారతీయులం. ఒకతల్లి గర్భవాసాన జన్మించాం, ప్రేమికులం. స్నేహితులం. సోదరులం. సత్యాహింసలు మన మూల సిద్ధాంతం. కాని, మనం ఒకరినొకరం ద్వేషించుకొంటున్నాము. నరుక్కొంటున్నాము. రాళ్లురువ్వుకొంటున్నాము. బాంబులు విసరుకొంటున్నాము. ఇండ్లువాకిళ్లు తగలబెట్టుకొంటున్నాము. పసిపిల్లల గొంతులు కోసుకొంటున్నాము. తిరిగి ఒకరి కొకరం ప్రేమ పాఠాలు చెప్పుకొంటున్నాము.

"ఇటుచూడండి యీపీనుగులవైపు-వీటి తలకాయలు వేరుచేయబడినాయి." అంటూ గైడు తన ఊకదంపుడు సాగిస్తూనేవున్నాడు. ఆ చిత్రాన్ని చూసేసరికి భారతి హృదయంగూడా చెమ్మగిలింది. కండ్లవెంట నీళ్లుతిరిగాయి. 'క్రూరుడైన కాశీరాజు వీరందరి శిరచ్ఛేదనంచేయించి, వారి దేహాలను కాకులకూ, గ్రద్దలకూవేయించాడు' అన్నాడుగైడు.

నిర్మల్ కి ఒక అసంగతమైన భావం తోచింది. కాశీరాజు నిజంగా క్రూరుడా? కాదు. అతను మానవులకంటే కాకులను, గ్రద్దలనే యెక్కువగా ప్రేమించివుంటాడు. ఆకారణంగా మానవ రక్తమాంసాలు వాటికి ఆహారంగా వేయించివుంటాడు.

పీనుగులు!

ఈగలు ముసురుతూ గాయాలనుండి రక్తం స్రవిస్తున్న యిరువదియేడు శవాలు రాతినేలపై పడివున్నవి... పంటకళ్ళములో పడియున్న జోరేలలా కసాయిదుకాణంముందు వ్రేలకట్టబడిన యిరువదియేడు మేకల దట్టాల్లా.

ఇరువదియేడు గాయాలనుండి రక్తంస్రవిస్తూ, ఈగలు ముసురుతున్న శవాలు...

విలేఖరిగా ఆస్పత్రికి వెళ్ళాడు నిర్మల్. ఇరువదియేడు శవాల నప్పుడే లారీలో హాస్పిటలుకు తీసికొనివచ్చారు. రాత్రి కర్ఫ్యూఉత్తరువుల నుల్లంఘించి బజారులో తిరిగిన మానవశరీరాలివి. ప్రాణంపోగొట్టుకున్నంతమాత్రాన వారి పని తీరిపోలేదు. పోష్టుమార్టం చెయ్యాలి. డాక్టరువచ్చి వీటన్నింటినికోసి ప్రాణంపోయిందని నిర్ణయించాలి.

నిర్మల్ యిదివరలో తనస్నేహితుని వెంట మెడికల్ కాలేజీకిపోయి Surgical-ward లో యిన్నిపీనుగులను చూచా డోకనాడు. నాటికి నేడు మరలఁ యిక్కడ ... ... ...

ఇరువదియేడు శవాలు. ముసలివాళ్లు, పిల్లలు, యువకులు, స్త్రీల కత్తిపోట్లకు గురియైన శవాలు, గాయాలనుండి నల్లనిరక్తం స్రవిస్తున్నదింకా. ఈగలు ముసురుతున్నవి. ఒక శవానికి తల, మొండెం వేరువేరుగా పడివున్నాయి.

హిందు వెవడు? ముస్లి మెవడు! మృత్యుదేవతదృష్టిలో అందరూ సమానులే. ఎవరు ముసలివారు? యువకులెవరు? భాగ్యవంతులెవరు? బీదవాండ్లెవరు? హంతకుని కత్తి అందరికీ సమానత్వమిచ్చి యీ రాతినేలమీద యిలాపరుండబెట్టింది, ఈ చల్లని రాతినేల!

ఇదే వారి అఖండ హిందూస్థాన్. ఇదే వారి పాకిస్థాన్ ఈ కాంతి, జీవంలేనిచూపులు, యీ నిరర్థకమైన చావు. యీ ఏకాంతవాసము. ఇదే వారిస్వాతంత్ర్యము. ఇదే వారి ఇస్లాం సిద్ధాంతం. ఇదే వారి వైదికధర్మం.

జయ జయ మహాదేవ్——అల్లాహో అగ్బర్——

నిర్మల్ రాజకీయాలకు దూరంగా వుండాలనుకొనే మనిషి. బ్రతుకుదెరువు కొరకై విలేఖరి వృత్తి నవలంభించినా, ముఖ్యా రాజకీయాలకు దూరంగా వుండడానికే ఎప్పుడూ ప్రయత్నించేవాడు. దయారసంతో కూడుకొన్న నిర్మల స్వభావ మతనిది. గలాటాలు బయలుదేరిన మూడవ రోజునే శివాజీ పార్కులో ఒక శాంతి సంఘాన్ని స్థాపించా డతను. శాంతి సంఘానికిగాని, సేనాదళానికిగాని

అంజుమన్ ఖుద్దం—ఇ—నతన్‌కి గాని ప్రచార మవసరం. అందుకొరకై నిర్మల్ అన్ని దినపత్రికలలోనూ పరిచయ మేర్పరచుకొన్నాడు. శివాజీపార్కులోని శాంతి సంఘపు కార్యవర్గంలో ఒక మెంబరుగా గూడా ఎన్నుకోబడినాడు. శివాజీపార్కు-శాంతిసంఘంలో అహమ్మ దొక్కడే మహమ్మ దీయుడు. అనవవసరంగా రెండు మతాలలోనుండి మెంబర్లను ఎన్నుకోవడమేగాని యిలాంటి సంఘాలు గడిచి గట్టెక్కవు.

కొన్నాళ్ళపాటు నిర్మల్ శాంతిసంఘపు కార్య కలా పాలలో మునిగిపోయాడు. యుద్ధంలో సైనికుడు ప్రదర్శించే ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాడు ఇది నిజంగాయుద్ధమే. వెలు తురుకు, చీకటికి, శాంతికి, అశాంతికి మధ్యయుద్ధం. మత పిచ్చను, హింసాకాండను, పశుత్వాన్ని ఎదిరించే శాంతి యుద్ధంలో జేరిన సైనికు డతను. గొప్ప నాయకుడు కావా లనే విచార మతనికిలేదు. తన విద్యుక్తధర్మాన్ని నెరవేరు స్తున్నాననే తృప్తి వున్న దతనికి.

ఇక్కడనుండి ఎక్కడికైనా పోదామని అతనిని చాలా సారులు బలవంతపెట్టింది భారతి. దూరంగా-చాలాదూరంగా ఆగ్రా—ఢిల్లీ—కాశ్మీర్—అజంతా- మైసూర్- సిలోన్- ఎక్కడికో ఒకచోటకు వెళ్ళిపోదాం. ఈ గలాటలుసర్దుమణ గిన తరువాత తిరిగివద్దాం- అతను ఇదివరకు చూడాలను కొన్న ప్రదేశాల నన్నింటినీ ఏకరువు పెట్టింది. కాని అతను ఇటువంటి పరిస్థితులలో బొంబాయి విడిచిపెట్టడం పిరికివాని లక్షణమని భావించాడు. నీలాంటి ఉత్తమ సాహిత్యవేత్త యిలా యిక్కడ చిక్కుల్లో తగులుకొనడం మంచిదిగాదని

వాదించేది భారతి. అతను పెడచెవినిపెట్టేవాడు. ఆఫీసు టైములోతప్ప మిగతా కాలాన్ని శాంతిసంఘపు కార్యకలాపాలకే వినియోగించేవాడు.

శాంతిసంఘములోని మెంబర్లంతా యిరుతెగలవారి యిండ్లకుపోయి, వారివారి ద్వేషాలను చంపుకొని శాంతంగా జీవించండని ప్రబోధించాలనే నిర్ణయం జరిగింది. కాని అంత కంటెముందే,నగరములో పుకార్లు బయలుదేరాయి. ఈ గాలి వార్తలు శివాజీపార్కుకుగూడా ప్రాకాయి.

మాహింలోనున్న మహమ్మదీయు లంతా ఏకమై శివాజీపార్కులోనున్న హిందువుల మీద దాడిచేయబోతున్నారని,

శివాజీపార్కులోనున్న హిందువులంతా మాహిం మహమ్మదీయులమీద పడబోతున్నారని,

హిందూ పాలవాళ్ళంతా తమతమ పాలల్లో విషం కలుపుతున్నారు—మహమ్మదీయుల కమ్మడానికని,

కూరగాయలమ్మే మహమ్మదీయులంతా తమ కూరగాయల్లోకి విషాన్ని ఇంజెక్షను చేస్తున్నారు, హిందువుల కమ్మడానికని,

ఇరానీ హోటల్లో టీ త్రాగవద్దు- అందులో విషం కలిపారని,

హిందూ మిఠాయిదుకాణాలలో మిఠాయి తినవద్దు— అందులో విషమున్నదని,

అబద్ధాలు, గాలివార్తలు!! పుకార్లు!!!

ఈ నీలివార్తలు నగరమంతటా వ్యాపించాయి. శాంతి సంఘపు మొట్టమొదటి పనిగా యీ గాలి వార్తల నెదుర్కోవాలనుకున్నారు—నిర్మల్, అహమ్మదులు. కాని త్వరలోనే నిష్ప్రయోజనమని తెలిసికొన్నారు.

శాంతిసంఘము కొరకై చందాలు వసూలు చేయాలనుకొన్నారు-నిర్మల్, అహమ్మదులు కలిసి. వారికి నిర్ణయించిన చోట్లకల్లా చందా వసూళ్ళకై బయలుదేరారు. కొందరు ముస్లిములు ఏమీ ముట్టచెప్పకపోగా, వారికి నిర్ణయించిన మాసవారీచందా యివ్వడానికి గూడా నిరాకరించారు. 'ఈశాంతిసంఘాన్ని మాటుపెట్టుకొని హిందువులాడబోయే నాటకమంతా మాకు తెలుసు. అందుకనే మాస్వరక్షణకొరకు పఠానులను పెట్టుకొన్నాము' అన్నారు.

'ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో ఆయుధాలు లేని మీ వాలంటీరు లేమిచేయగలరు? సిక్కులు కృపాణాలు ధరించవచ్చు. అది వారి జన్మహక్కు. అందుచే మారక్షణకొరకు సిక్కులనుకావలిపెట్టుకొన్నా'మన్నారుకొందరుహిందువులు.

ఎలాగో కష్టపడి కొంతధనం ప్రోగుచేశారు. కర్ఫ్యూలేని రోజుల్లో నగరంలో శాంతిని కాపాడడానికని, నెలకు యాభైరూపాయల జీతంమీద, యిరువదిమందిని నియమించారు. వారి నెక్కడెక్కడ నియమించాలనేది కార్యవర్గంలో చర్చకు వచ్చింది.

'ప్రతిరోడ్డు క్రాసింగువద్ద ఒకనిని నియమిస్తే...'

'ఫర్లాంగుకు ఒకడిని దడిగట్టినట్టు పెడితే...'

'మనకు మూడువైపులనుండే దెబ్బతగిలేది. మాహిం వైపునుండీ, వోర్లి వైపునుండి, సముద్రపువైపునుండి. ఈ మూడువైపుల కాచుకొంటే సరిపోతుంది.'

'దెబ్బ... కాచుకోవటం... ఎవరినుండి ? ముస్లిముల నుండి... సహజంగా యీ మూడు వైపులనుండే ముస్లిములు దెబ్బతీస్తారు. అయితే యీ వాలంటీరు లేం చెయాలి?'

'ముస్లింగూండా బజారులోకనిపించగానే విజిలేయాలి. వేస్తే ఎక్కడివారక్కడ తప్పుకొంటారు.'

'గూండాలనేది ఒక్క ముస్లిములకేనా? హిందువుల కది వర్తించదా?' అని కమిటీని ప్రశ్నించాడు నిర్మల్.

'నీకు తెలియదు నిర్మల్. గూండా అనేపదం ఒక్క మహమ్మదీయులకే చెల్లుతుంది.' అన్నాడొక సీనియరు మెంబరు.

మీటింగు అయిపోగానే నిర్మల్ అహమ్మద్‌ని కలసికొని 'వీరంతా కరడుగట్టిన హిందూమహాసభవాళ్ళలా నాకు కనిపిస్తున్నారు. నీవు వీరితో ఎలామెలుగుతావ్రా?'అన్నాడు

'ఫరవాలేదు నిర్మల్. ఇలాంటి అంధవిశ్వాసమున్నవాళ్లు యిరుపక్షాలలోనూ వున్నారు. మాహిం ముస్లిములలోగూడ యిలాంటి పుకార్లు వ్యాపించాయి.మన శాంతిసంఘం చాటు మాటుగా ఆయుధాలు స్వీకరిస్తున్నదని, దీనిని మాటుబెట్టుకొని శివాజీపార్కులోని హిందువులంతా మనమీద దాడి చేయబోతున్నారని వారిలో పుకార్లు పుట్టాయి.'

మందకొడిగా శాంతిసంఘపుపని సాగిపోతూనే వున్నది. వాలంటీర్లు, యూనిఫారాలు, బిగుల్సు, తీర్మానాలు, పోలీసు కమీషనరుకు అప్లికేషన్లు—

కాని శాంతిసంఘంచేసేప్రచారం వ్యర్థమైపోయింది.

'ముస్లిం గూండాలు'

'హిందూ గూండాలు'

'రాళ్ళు, కర్రలు, కత్తులు, మీఇండ్లు జాగ్రత్తచేయండి'

'నా ఇంట్లో పది లాఠీలు దాచాను'

'ఆ ముస్లింగూండాలను రానివ్వండి. పీకకోరుకుతాను'

'ఆ కాఫిర్ గూండాలను రానివ్వు, పలావ్ చేస్తాను'

శాంతి. శాంతి. శాంతి.

'అజంతా గుహాంతర్భాగముల ఎల్లెడల శాంతి, నిశ్చలత్వము తాండవిస్తోంది. మనం యిక్కడ కొన్నాళ్ళుంటే నీ హృదయానికి తగిలిన గాయం తప్పకుండా నయమవుతుంది' అన్నది భారతి.

'గుహలన్నీ చూశాం. ఇంకొక్కటి మాత్రమే మిగిలియున్నది. కాని యిందులో మీరు అపూర్వ శిల్పకళానైపుణ్యమును గాంచలేరు. ఇందులోనిగోడలు, చిత్తరువులు పైకప్పు స్తంభాలు అన్నీ అసంపూర్ణంగా వున్నవి. ఏదో కారణంవలన యీ గుహలోని పని అసంపూర్ణంగా నిలచిపోయింది' అంటూ గైడు సాగిపోతూనే వున్నాడు.

అసంపూర్ణమైన పని! నిర్మల్ గూడా బొంబాయిలో తనపని అసంపూర్ణంగా విడచిరాలేదా? అసంపూర్ణం... శాంతి సంఘం... కార్యవర్గం... ఆఖరి మీటింగు.

నిర్మల్ మొదటినుండి యీ వాలంటీరులకు బదులు (I. N A.) ఇండియన్ నేషనల్ ఆర్మీవాళ్ళను పెడితే వాళ్లు మంచి దేశభక్తులు. వాళ్ళలో కులతత్వాలంటూ లేవు. మానవసేవే మాధవసేవ అనే భావంతో కృషిచేస్తారు' అంటూ వాదిస్తూనేయున్నాడు. ఈమీటింగులో యీవాలంటీరులకు బదులు పద్నాలుగుమంది I. N. A మెంబర్లను నియోగించమని శక్రెటరీ రిపోర్టు చదివేసరికి నిర్మల్ ఆనందానికి మేరలేకపోయింది. ఇప్పుడు శాంతిసంఘం చక్కని పంథాలో నడుస్తుందని భావించాడు నిర్మల్. కాని వెంటనే కొంతమంది వ్యతిరేకించారు.

“ఈపద్నాలుగు మంది I. N. A. లలో ఒకముస్లిం గూడా వున్నమాట నిజమేనా?” అన్నాడొక లాయరు.

“అవును, ఒక్కడు మాత్రమే” అన్నాడు శెక్రెటరీ.

“ఈవిషయమే గోలగా మాపేటలో చెప్పుకొంటున్నారు”అన్నాడొక గుజరాతీ సేట్.

“ఘోరం, ఘోరాతిఘోరం”అన్నాడొక మార్వాడి.

“ముస్లిముని హాచ్‌మాన్‌గా ఎందుకునియోగించారో తెలుపవలసిందని నేను శక్రటరీగారినికోరుతున్నాను”అన్నాడు లాయరు.

“అతనిని తొలగించకపోతే చిల్లిగవ్వచందాయివ్వను” అన్నాడు సేట్.

“నిజమే. మా పేటలో గూడా యీమాటే అంటున్నారు”అని బలపరచాడు ఒక డాక్టర్.

"మన స్త్రీలగౌరవ ప్రతిష్టలు నాశనం కావడాని కిదొక హేతువు" అన్నాడు మార్వాడి.

"నేను శక్రటరీగారినుండి సమాధానం కోరుతున్నాను" అని బల్లగుద్దాడు లాయరు.

"చెప్పితీరాలి" అని లేచాడు ప్రెసిడెంటు.

ఈఉద్రేకాన్ని చల్లబరచ ప్రయత్నించాడు శక్రటరీ. "ఒక ముస్లింని హాచ్‌మాన్‌గా నియమించినంత మాత్రాన మునిగిపోయిం దేమిటో నాకర్థంకాలేదు. I. N. A. సైనికు లకు కులతత్వాలు, మత భేదాలులేవు. సేవ చేయడమే వారి పరమావధి. కాదని మీరు తీర్మానిస్తే ఏదో వంకతో అత నిని తొలగిస్తాము"

"అవశ్యం"

"తక్షణం"

"ఆలస్యా దమృతం విషం" అన్నారు. ఈమాటలు విని అహమ్మద్ చిరునవ్వు నవ్వుకొన్నాడు.

అతని నవ్వు చూచేసరికి నిర్మల్ హృదయానికి బాధ కలిగింది. 'లేదు. లేదు' అంటూ ఉద్రేకంతో అరిచాడు. 'I. N. A వాళ్ళలోనున్న ముస్లింని తీసివేయడానికి యీ కమిటీ ఏకగ్రీవముగా తీర్మానించింది' అని శక్రటరీ మినిట్ బుక్కులో వ్రాయబోతున్నాడు. 'లేదు! లేదు!! లేదు!!' అంటూ నిర్మల్ కుర్చీలోనుండిలేచి తటాలున శక్రటరీచేతిలో నున్న కలాన్ని వాడేసి లాక్కున్నాడు. ఆ ఊపులో సిరా తుడుపొకటి ఆ తీర్మానంమీాద పడింది.

'నే నీతీర్మానాన్ని ఎదిరిస్తున్నాను. నే నీతీర్మానాన్ని వొప్పుకోను. ముమ్మాటికీ వొప్పుకోను. ఒకరు ఎదిరించినా తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడిందని వ్రాయడానికి వీలులేదు. తొమ్మిదిమంది తీర్మానానికి అనుకూలంగా వోటు చేసినా ఒక్కరే పదిసార్లు ఎదిరిస్తే ఆ తీర్మానం నెగ్గగూడదు. ఇటువంటి తీర్మానంచేయడం శాంతిసంఘానికే అవమానకరం. అప్రతిష్ట. కుల తత్వాలు సమసిపోవాలని మనం ఒక వంక ప్రచారంచేస్తూ, మనమే కులతత్వాలవలలోతగుల్కొంటున్నాము. ఈ తీర్మానాన్ని మీరు ప్యాసుచేస్తే నావిద్యుక్త ధర్మంగా యిందులోని అంతరార్థాన్ని పత్రికలద్వారా ప్రజల కెరుకపరుస్తాను.'

'నీదంతా వృథా కంఠశోష' అన్నట్లు అహమ్మద్ బిగ్గరగా నవ్వుకొన్నాడు.

వెంటనే మార్వాడీ అందుకొని, 'మనహిందువు లెటువంటి కష్టాలలోవున్నారో నీకు తెలియదు నిర్మల్'అన్నాడు.

'ఈ ముస్లిముని తీసివేయకపోతే మేమొక్కదమ్మిడీ చందా యివ్వం' అన్నాడు సేట్.

'మేమంతా రాజీనామా దాఖలుచేసి హిందూమహాసభవాళ్ళ స్వయంసేవకసంఘములో జేరుతాం' అన్నాడు డాక్టర్.

'ఒక్క విషయ మాలోచించు నిర్మల్. ఇదంతా హిందువులు నివసించేప్రదేశం. పాప మా ముస్లిముకు ఏదైనా అపాయం సంభవిస్తే దానికి బాధ్యులెవరంటావ్? గస్తీతిరిగేటప్పుడు అతని కేదైనా అపాయం రావచ్చు. అప్పు

డతనిని రక్షించేదెవరు.?' అంటూ తార్కికాన్ని ఉపయో గించి, చూచారా నా తడాఖా అన్నట్లు మిగతావారి వైపు చూచాడు లాయరు.

తీర్మానం పాసయినది. నిర్మల్ హృదయం అట్టుడికిన ట్లుడికిపోయింది. అజ్ఞానులతో తర్కించి లాభంలేదని ఊరు కున్నాడు.

కాని అన్నిదిశలనుండి 'నిర్మల ఏమీ మాట్లాడలేదు'

'నిర్మల ఏమీ వినలేదు—'

అనేవాక్యాలు వినవస్తున్నవి. అతనిమనస్సు చివుక్కు మన్నది.

కలకత్తా-బాంబే-నౌకాలీ-బీహార్ - పంజాబ్-రావ ల్పిండి-లాహోర్-అహమ్మదాబాద్ ...!

ముస్లిములను ఖూనీ!

హిందువులను సఫా!

రక్తపు సెలయేళ్లు! రక్తపు నదులు! రక్తసముద్రం! ఈర్ష్య, ద్వేషం! హింసాకాండ, కత్తిపోట్లు! కుప్పలుతిప్పలుగా వీధులలో పడివున్న శవాలు, ఈగలు ముసురుతున్న కళేబ రాలు, వాసనగొడుతున్న పీనుగలు, ఆకాశానఆడే గ్రద్దలు, రాబందులు ... ఆకాశానికంటే మంటలు ... విదేశీయులునవ్వ డానికి, హేళనచేయడానికి కారణమైనవి.

నిర్మలతలకాయ పెద్ద రైల్వేజంక్షనైంది. కొన్ని రైళ్లు పట్టాలమీదుగా సాఫీగాపోతున్నవి. కొన్నిఒకదానితో ఒకటి ఢీకొంటున్నవి. ఇదంతా I. N. A. లో ముస్లింమెంబ రుని తీసివేసినందులకు వచ్చిన పరిణామం.

నేతాజీ సుబాస్‌చంద్ర బోస్, ఆయనస్థాపించిన ఇండియన్ నేషనలు ఆర్మీ J. N. A., దానియొక్క వీరోచిత కృత్యాలు, అదిసల్పిన స్వాతంత్ర్యపోరాటాలు, అది ధారపోసినరక్తం, అదిచేసిన త్యాగం అంతా బూడిదలోపోసినపన్నీ రేనా? దానినాయకులు, ప్రతిఒక్కరు నిరుపయోగం. శివాజీ పార్కులోని శాంతిసంఘాలు నిష్ప్రయోజనం. అందులోపని చేయడం తెలివితక్కువ. ఈ పరిస్థితులలో బొంబాయిలో వుండట మనవసరం. అసలికజీవించడం నిరర్థకం. వీడు హిందువు, వీడు మహమ్మదీయుడు, వీడు సిక్కు, వీడు కిరస్తానీ, అంటూ వీళ్ళముఖాన అట్టలుకట్టుకు తిరుగుతున్నారు. స్వాతంత్ర్యము, శాంతి, ఐక్యతలకంటే యిదే వారి నెక్కువగా ఆకర్షించింది.

శాంతిసంఘం కార్యవర్గమంతా నోళ్లు తెరుచుకొని భూతల్లా కనిపించారు నిర్మల్‌కు. ఈ పది భూతాలే కాదు. అన్నివైపులనుండి అనేక భూతాలు నోళ్ళు తెరచుకొని తన వైపు వస్తున్నట్లు కనిపించినది. అందులోకొన్నింటికి గడ్డాలున్నవి. కొన్నింటికి నెత్తిమీద శిఖలున్నవి. ముస్లిము, హిందువు, బెంగాలీ, బీహారీ, పంజాబీ, పఠాన్, మహారాష్ట్రి గుజరాతీ,సింధీ - అన్ని భూతాలూ వున్నాయి. అన్నీ రక్తదాహంగొనివున్నాయి. రక్తాన్ని జుర్రుకోవాలని 'రక్తం రక్తం' అని అంగలారుస్తున్నాయి.

'బ్రతకాలనివుంటే పారిపో' అని నిర్మల్ హృదయం అలారంలా హెచ్చరించసాగింది.

కాని ఆనాడు మీటింగు పూర్తయేవరకూ యెక్కడకూ కదలలేదు. మరునాడు భారతిని వెంటబెట్టుకొని బొంబాయినుండి బయలుదేరాడు.

'ఎక్కడకు వెళ్ళుదా'మని అడిగింది భారతి.

'రక్తపాతం - దెబ్బలాటలు - పత్రికలు, రేడియో - హిందువులు-ముస్లిములు-కత్తులు, బాంబులు-మతపిచ్చి-ఇండ్లు తగలబెట్టుకోడాలు — గూండాలు లేనిచోటుకు వెళ్లుదాం. దూరంగా, చాలాదూరంగా, యీప్రపంచానికిదూరంగా, యీ జీవితాలకుదూరంగా వెళ్లుదాం' కొంచెం సేపాలోచించి 'అజంతా వెళ్ళుదాము' అన్నది భారతి.

అహమ్మద్ యూనిఫారంలోవచ్చి వారిని స్టేషనులో కలుసుకున్నాడు. 'ఈ అజ్ఞానాంధకారమునుండి బయటపడి కొన్నాళ్లు వెన్నెల వెలుగు బాటల్లో విహరించడంమంచిదే! కాని వచ్చే ఆదివారం జనరల్ బాడీ మీటింగున్నది. అదీ మాత్రం మరచిపోకండి. ఆ మీటింగులో నేను కొన్నిముఖ్యమైనతీర్మానాలు పెట్టబోతున్నాను. అందుచే మనం ప్రజల్లో మంచి పలుకుబడి సంపాదించవచ్చు. మీ రానాటికి తప్పక రావాలి' అన్నాడు.

'నే నికెన్నటికీ ఆ సంఘంలో పనిచేయను'అని నిర్మల్ అంటుండగా బండికదిలింది.

'అలా అనకు నిర్మల్! మన మీ పనిని అసంపూర్ణముగా విడిచిపెట్టగూడదు.' అంటూ అహమ్మద్ బండివెంట కొంతదూరం నడిచాడు.

*    *    *

...అసంపూర్ణం...

'ఏంచేస్తాం. ఒకరు చేయగలిగిన దేదో చేస్తారు. ఈ అజంతాగుహ, పైకప్పు, స్తంభాలు, గోడలు అన్నీ అసం పూర్ణముగా లేవా? ఎనిమిదివందల సంవత్సరాలు కష్టపడి గూడా యీ గుహ నిలా అసంపూర్ణంగా ఎందుకు విడిచి పెట్టినారు? ఏమంటావ్ భారతి?'—

గైడుకాని భారతికాని, అక్కడ లేరు. నిర్మల్ ప్రశ్న ఆ గుహంతా సంచారంచేసి తిరిగి అతనివద్దకేవచ్చింది. భావతరంగాలలోపడి కొట్టుకుంటూ చీకటిగానున్న ఒక మూలకు చేరాడు. భారతికి గైడుకి అతను కనిపించకపోయే సరికి ఒకవేళ విసుగెత్తి రహదారీబంగళాకు తిరిగి వెళ్ళిపోయి నాడేమోనని భావించారు.

ఆ గుహలో, చీకటి మరుగున రెప్పవేయకుండా ద్వారమువైపుచూస్తూ నిశ్చలంగా కూర్చున్నా డతను.

చరమ భానుని అరుణ కిరణాలు కొండకు, లోయకు బంగారు మలామావేస్తున్నాయి. చీకట్లు మెల్లమెల్లగా గుహ లలో ప్రవేశిస్తున్నాయి. నిర్మల్ లేచి అసంపూర్ణంగా నున్న ఆ గుహను ఆఖరుసారిగా ఒక్కమాటు చూచి వెళ్లుదామను కున్నాడు. ఇంతలో ఎవరో చీకటిలో కొవ్వువత్తి పట్టుకొని మామూలుద్వారమునగాక వెనుకవైపునుండి వస్తున్నట్లు గమనించాడు నిర్మల్. గైడే తనను వెదకుకుంటూవస్తున్నా డని మొదట్లో అనుమానించాడు. కొవ్వువత్తి వెలుగులో, బోడితల, పసుపుపచ్చని అంగరఖాతో నున్న బౌద్ధ బిక్షు వుని చూచేసరికి అతని అనుమానం పటాపంచలైపోయింది.

ఈ గుహతో ఎంతో పరిచయమున్నవానిలా కనిపించాడు అతను. నిర్మల్ అక్కడున్న సంగతిగూడా గమనించకుండా ఎంతో ప్రశాంత చిత్తంతో మెల్లగా ఒక స్తంభమువద్దకు పోయి, కొవ్వువత్తి నొకగూటిలోబెట్టి అంగరఖాలోనుండి ఉలి, సుత్తె తీసి ఆ స్తంభం చెక్కనారంభించాడు.

అడుగుల చప్పుడు విని నిర్మల్ వెనుదిరిగి చూచేసరికి నీడలోనుండి యింకా కొంతమంది బౌద్ధబిక్షువులువస్తున్నట్లు కనిపించింది. వారిలో ఒక్కరుగూడా తలయెత్తి నిర్మల్ వంక చూడలేదు. అందరూ క్రొవ్వువత్తుల నక్కడపెట్టి స్తంభాలు మలుస్తూనో, శిల్పాలు చెక్కుతూనో, చిత్తరువులు వ్రాస్తూనో వారివారి పనులలో తన్మయులైనారు. కొంత మంది దానిని సాపుచేస్తూవున్నారు. వెనుకనే కొంతమంది దానిమీద చిత్రాలుగీస్తున్నారు. అసంపూర్ణముగానున్న గుహ ఉలుల మ్రోతతో ప్రతిధ్వనించసాగింది.

కొంతసేపు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు నిర్మల్. గుర్తిక్కతిప్పుకొని మొదటిబిక్షువువద్దకుపోయి 'మీకడ్డువచ్చి నందుకు క్షమించండి. మీరిలా పనిచేస్తుంటే నాకాశ్చర్యంగా వున్నది.' అన్నాడు.

'ఎందుకు?'

'ఈ గుహ యిలా ఎల్లకాలమూ అసంపూర్ణంగానే నిలిచివుంటుందని భావించాను.'

'ప్రపంచ మిప్పటికీ యింకా అసంపూర్ణముగానే యున్నది. మానవులుగూడా అసంపూర్ణముగనే యున్నారు. వారిలోని మానవత్వ మిప్పటికీ పరిపూర్ణత్వమునుచెందలేదు.

కాని యీనాడు కాకున్నా, ఏనాటికైనా వారు పరిపూర్ణత్వ మును సాధించితీరుతారు.'

చికాకుగానున్న నిర్మల్‌బుద్ధి యిందులోని భావాన్ని గ్రహించలేకపోయింది. 'అయితే ఎన్ని సంవత్సరాలనుండి మీ రీపనిలో నిమగ్నులైవున్నారు?' అని నిర్మల్ తిరిగి ప్రశించాడు.

'ఎనిమిదివందల సంవత్సరాలు'

'ఎనిమిదివందల సంవత్సరాలే! మీరుచూస్తేనాకంటే'

'నాకుముందు నాతండ్రి, అతనికిముందు అతనితండ్రి ఒకతరంతరువాత మరొకతరం. కర్మచక్ర మిలా పరిభ్రమిస్తూ వుంటుంది.'

వ్యక్తికత సంభాషణలోకి దింపాలని 'మీ పేరేమిటి?' అన్నాడు నిర్మల్.

'ఇక్కడివారికి పేర్లంటూ వుండవు'

నిజమే! ఏశిల్పంమీదగాని, ఏచిత్రరువుమీదగాని అజంతా గుహలలో ఎక్కడా అజంతా శిల్పులపేర్లు కని పించలేదు నిర్మల్‌కి. కళారాధకు లిలా నిరాడంబరముగా అమరజీవులై వుంటారనిపించింది.

'మీరంతా ఎందుకిలా కష్టపడి పనిచేస్తారు?' అని ప్రశ్నించాడు నిర్మల్.

'అది మానవుని విద్యుక్తధర్మం. ప్రతిఫలాపేక్షతో మేమీపని చేయడంలేదు.'

'అయితే యిది పూర్తిగావడానికి ఇంకెంతకాలం పడుతుంది?'

'ఎవరు చెప్పగలరు?

'ఈగుహ—'

'బహుశా రెండువందల సంవత్సరాలు పట్టవచ్చు. తరువాత మరొకటి మొదలుపెడతాం. తరువాత మరొకటి—'

'అయితే అజంతాఎప్పటికీ పూర్తికాదన్నమాటేనా?

'మానవుడు పరిపూర్ణత్వమును చెందనంతవరకూ అజంతా పూర్తిగాదు.'

నిర్మల్ అల్పపరిజ్ఞాన మంతటి ఉన్నతశిఖరాల కెగురలేకపోయింది. అతడు అపహాస్యంగా 'అయ్యా! దయచేసి తమరిది సెలవివ్వండి. అనేకవందలసంవత్సరాలు, అనేకవేల మంది, అమూల్యమైన కాలాన్ని, మానవశక్తిని, బుద్ధి బలాన్ని ఎందు కిలా దుర్వినియోగంచేస్తున్నారు? ఎందుకు? దేనికొరకు? ఈకొండకోనల్లో యీశిల్పాలను, చిత్తరువులను తీర్చిదిద్దడంలో మీ ఉద్దేశ్యమేమిటి?' నిర్మల్‌కి ఆవేశం వచ్చింది. స్థాయి హెచ్చించి 'దేనికొరకు? మీ కాలాన్ని, శక్తిని యిలా రాళ్లు చెక్కడంక్రింద వృథాగా వ్యయపరచే కంటే, విశ్వమానవ కళ్యాణానికి, సౌభ్రాతృత్వానికి వినియోగించివుంటే ఎంతైనా బావుండేది' అన్నాడు.

అలా జరిగివున్నట్లయితే యీనాడిలా ఒకరి నొకరు గొంతులు కోసుకొనేవారుకారు. ఇంత రక్తపాతం జరిగేది గాదు. మమ్ములను మోసపుచ్చడానికి. తప్పుత్రోవలను బెట్టడానికి, మామనస్సులను చికాకుపెట్టడానికి మీరు అజంతా గుహలను మలుస్తున్నారు. మీరు మాకు పిరికిమందు పోస్తున్నారు. ఈ గుహలు పారిపోయివచ్చేవారికి స్వర్గము. సత్యా

న్నుండి జీవితాన్నుండి, ప్రపంచాన్నుండి, నిజాయితీనుండి పారిపొండని ప్రోత్సహిస్తున్నది అజంతా.

ఈమాటలకు బౌద్ధభిక్షువు జవాబివ్వదలచలేదు. అతని అమాయకత్వమునకు జాలిపడి ఒక్క చిరునవ్వు నవ్వి తన పనిలో లీనమైనాడు.

నిర్మల్ వెనుకటి ఆవేశముతోనే 'అజంతా యొక్క ప్రయోజన మేమిటి? అది లోకానికిఇచ్చే సందేశ మేమిటి? అన్నాడు.

'విను'

అంటూ బౌద్ధబిక్షువు తనపని ప్రారంభించాడు. క్లిక్-క్లిక్-మనే ఉలులచప్పుడుతప్ప మరో శబ్దము లే దాగుహాలో.

బౌద్ధభిక్షువు అజంతాయొక్క ప్రయోజనాన్నిగూర్చి, అది యిచ్చేసందేశాన్ని గూర్చి పెద్ద వేదాంత పరమైన ఉపన్యాసాన్నిస్తాడని చెవులునిక్కించుకు కూర్చున్నాడు నిర్మల్. ఉలి యొక్క క్లిక్ క్లిక్ మనే శబ్దము తప్ప భిక్షువు పెదవి దాటి ఒక్క మాటగూడా రాలేదు. పండుటాకుల్లా రాతి పెచ్చులు ఊడి క్రింద బడుతున్నాయి.

'అజంతా యిచ్చే సందేశం...?'

ఇంతలో అతని కేదో దివ్యానుభూతికలిగి ఆ వాక్యమలా మధ్యలోనే ఆగిపోయింది.

ఉలుల చప్పుడు తప్ప మరొక శబ్దము లే దా గుహలలో. అజంతా యిచ్చే సందేశ మిదే కాబోలు. బౌద్ధభిక్షువు 'విను' అన్న దిదే కాబోలు!

నిర్మల్‌కు వివేకోదయం కావడం బౌద్ధభిక్షువు గమనించాడు. తనపని తాను చేసుకుంటూనే ఒక్క చిరునవ్వు నవ్వాడు. వేదాంతులకు సైతం అర్థంకాని ఒక దివ్య సందేశాన్ని తెలిసికొన్నాడు నిర్మల్. భూమాత ఒడిలో పండుకొని అమందానందాన్ని అనుభవిస్తున్నట్లు భావించాడు.

క్లిక్ — క్లిక్ — క్లిక్ —

ఒక్కొక్క సుత్తెదెబ్బ ఒక్కొక్క సందేశం.

పని-కష్టపడి పనిచెయ్యి—సోమరిగా కూర్చుండకు.

ఈ కొండలను తొలచడం మానవుల పని. అందులో నుండి కళ ఆవిర్భవిస్తుంది. మానవజీవితముయొక్క చరమ లక్ష్యం కళ. కళలేనిదే జీవితములేదు. ఈచిత్రాలను గీయడం మానవుని విధి. అందుచే మానవునిలో పశుత్వం నశిస్తుంది. ఈ రంగులనువేయడం మానవుల కర్తవ్యం. అందుచే మానవులకు పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది. పని అంటే ఋజుమార్గం—

క్లిక్ —క్లిక్ —క్లిక్

లయబద్ధమైన శబ్దం. ఈనాడు కాకున్న రేపు, వందసంవత్సరములకు — కాకున్న రెండువందల సంవత్సరములకు, యీ రాళ్ళన్నీ అందాలు చిందుతూ మహోత్కృష్టమైన కళాఖండాలుగా రూపొందుతాయి. ఒకరుకాదు. ఇద్దరుకాదు, అనేకవేలమంది శిల్పులు యీ కళాఖండాలకై తమజీవితాలను ధారపోస్తారు. తరతరాలకుగూడా యీపని పూర్తిగాదు. అసలు కళయొక్క చరమలక్ష్యం మానవ పరిపూర్ణత్వమే.

క్లిక్ — క్లిక్ — క్లిక్

లయబద్ధమైన శబ్దము.

ఈనాడుగాకున్న రేపు, వందసంవత్సరములకు గాకున్న రెండువందల సంవత్సరాలకు, ఈనాడు గాకున్న ఏదో ఒక నాడు మానవుడు పరిపూర్ణత్వమునుపొంది విజ్ఞాన, వికాసాలతో విరాజిల్లాలి. ఒకరు కాదు, ఇద్దరుకాదు, అనేకవేల మంది అందులో భాగస్వాములౌతారు. తరతరాలుగా శాంతి సౌఖ్యాల ననుభవిస్తారు. మానవపరిపూర్ణత్వమే దాని చరమలక్ష్యం.

క్లిక్ క్లిక్ క్లిక్

లయబద్ధమైన శబ్దము. ఆ బౌద్ధభిక్షువు తన బొటన వ్రేలికి దెబ్బతగిలినసంగతికూడా తెలియని తన్మయత్వములో పనిచేస్తున్నాడు. రక్తం ధారగా ఆ రాతినేలమీద పడుతున్నది. ఈ కారణంగా అజంతా యుగయుగాలు నిలచి వుంటుందని భావించాడు నిర్మల్. ఈచిత్తరువులన్నిటికి రంగులకు బదులు, కళాకారుల రక్తమే ఉపయోగించివుంటారను కొన్నాడు.

బాలభానుని అరుణ కిరణాలు దిశావలయాన్ని ఆక్రమించాయి. ఆప్రదేశమంతా నిర్జనంగా కనిపించిందినిర్మల్‌కు. ఆ శిల్పులుగాని, చిత్రకారులుగాని, క్రొవ్వొత్తులుగాని కనుచూపుమేరలో కనిపించలేదు.

ఇదంతా కలగాతోచిం దతనికి, ఎంత అద్భుతమైన కల! 'ఇది తప్పక కలే అయివుంటుంది. ఇప్పటి పరిస్థితులలో, ఇటువంటి వాతావరణములో, ఇటువంటి కల రావడములో ఆశ్చర్య మేమీలేదు' అనుకుంటూ అతను రాత్రి బౌద్ధ

బిక్షువు చెక్కిన స్తంభమువద్దకుపోయి చూచేసరికి దాని మీద క్రిందటిరోజులేని తామర కమల మొకటి చెక్కబడి యున్నది. ఇదిగూడా కలేనా? ఊహేనా?

అతని చూపులు అప్రయత్నంగా రాతినేలమీద వ్రాలాయి. రక్తపుమరక .........కనిపించింది...ఎర్రని రక్తము......

భారతిని కలుసుకోకుండానే అతను తిన్నగా రైలు స్టేషనుకు వచ్చి బొంబాయికి టిక్కెట్టు తీశాడు. మరునాడు ఆదివారం. రేపు జరిగే మీటింగులో అహమ్మద్ పెట్టబోయే తీర్మానాలను బలపరచేటందుకు ఏమైనాసరే, రేపు బొంబాయిలో ఉండాలనుకొన్నాడు. దెబ్బలాటలనుండి, జీవితాన్నుండి, బొంబాయినుండి పారిపోగూడదనుకొన్నాడు. రైలులో తోటిప్రయాణీకు డెవరో 'అజంతా పోయి వస్తున్నారా?' అనిప్రశ్నించాడు. లేదు — లేదు — నేనిప్పుడు అజంతాకు అభిముఖంగా పోతున్నాను'అని జవాబు చెప్పాడు నిర్మల్.

# పుత్రుడు

'మంచిది. ఇంక మీకు నా ముఖ మెన్నటికీ చూపించను.' ఈ శబ్దము ఠాకూర్ కృష్ణసింహుని కర్ణపుటాల్లో మాటిమాటికి ప్రతిధ్వనిస్తున్నది. ఆ వాక్యంలోనున్న ప్రతి అక్షరమూ బాకులా అతని హృదయాన్ని దూసుకుపోయి బాధ కలిగిస్తున్నది. చిరాకు పెడుతున్నది. కోపాన్ని పుట్టిస్తున్నది. తోచకుండా చేస్తున్నది.

'మంచిది, ఇంక మీకు నా ముఖ మెన్నటికీ చూపించను' అంటూ అతను వెళ్ళిపోయేటప్పుడు చివికి, పాలీషుహీనమైన అతని బూట్ల చప్పుడులో నిశ్చయత్వము, ధృడసంకల్పము, ఉద్రేకము స్ఫురించాయి.

రంగు వేసిన మీసాలను అలవాటు ప్రకారం సవరించుకొంటూ యిలా ఆలోచించసాగాడు ఠాకూర్ సాహెబ్: ప్రపంచము ఏమి కాబోతున్నది? రైతులు జమీందారులకు ఎదురు తిరుగుచున్నారు. కార్మికులు పెట్టుబడిదారుల నెదుర్కొంటున్నారు. కొడుకు తండ్రిని ధిక్కరిస్తున్నాడు. తరతరాలనుండి వస్తున్న సంబంధం, ఆచార వ్యవహారాలూ, సాంఘిక వ్యవస్థ

అంతా మట్టిలో కలిపేస్తున్నారు. భారతదేశ మొక్కలే రెండుముక్కలుగాలేదు. ప్రతికొంపా, ప్రతికుటుంబమూ, చివరకు ప్రతిమనిషి రెండుముక్కలై పోయాడు. కొడుకుతండ్రితో కూతురుతల్లితో, భార్యభర్తతో వేరై పోతున్నారు. అందాకా ఎందుకు? ఒక్కగర్భవాసాన జన్మించినఅన్నదమ్ములే తన్నుకు చస్తున్నారు. ఇదంతా ఆఖరుకు ఏమి కాబోతున్నదో?

ఈ ప్రశ్న అతని హృదయ కవాటాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నది. ఆఖరికి ఏమి జరుగబోతున్నది?

అతనీప్రశ్నే తన ఆఫీసుగదిలోని గోడల నడిగాడు. గోడలపైనున్న తన పూర్వుల తైలవర్ణచిత్రాల నడిగాడు. చిరునవ్వు వెన్నెల లొలకబోస్తున్న అహింసామూర్తులు గాంధిజీ, బుద్ధభగవానుల విగ్రహాల నడిగాడు. వాకిలి ముందు ఎగురుతున్న త్రివర్ణపతాకాన్ని అడిగాడు. బంగారు ఫ్రేములో బిగించబడివున్న భారతమాత నడిగాడు. ఇంటి భారాన్నంతా నెత్తినబెట్టుకొని మోస్తున్న రాతిస్థంబాల నడిగాడు. అద్దాల బీరువాలలోనున్న లా పుస్తకాల నడిగాడు. గోడపై గాలికి పక్షిలాకొట్టుకొంటున్న కాలెండరు నడిగాడు. గోడగడియారా న్నడిగాడు. డబ్బుతో మూలుగుతూ మూలనున్న ఇనుపపెట్టె నడిగాడు.ఆఖరికి రత్నఖచితసింహాసనముపై విరాజిల్లుతున్న మహారాజులా ఇనుపపెట్టెపైనున్న తెల్లని ఖద్దరుటోపీ నడిగాడు.

ఈ అశాంతి, ఈ అవ్యవస్థ, ఈ విద్రోహం ప్రశాంతమయసమాజంలో ఏ విప్లవాలు తీసికొనిరానున్నవో!

అతని హృదయకుహరాన్నుండి వెలువడిన యీ ప్రశ్న అనే రబ్బరుబంతి, గోడలకు, గడియారానికి, తైలచిత్రాలకు ఇనుపపెట్టెకు, కాలెండరుకు కొట్టుకొని తనవైపే తిరిగి వస్తున్నది. కాని జవాబుమాత్రం ఎక్కడనుండీ రావడంలేదు. ఇంట్లోనున్న ప్రతివస్తువు మౌనముద్ర వహించింది. ఒక్క ఆఫీసుగదే కాదు. ఇల్లంతా పాడుబడినట్లున్నది. ఒక్కగాను ఒక్కకొడుకు ఇంటికైన వెలుగు వెళ్ళిపోగానే యింట్లో అంధకార మావరించింది. ప్రతివస్తువు నిష్ప్రయోజనంగా కన్పించసాగినది. అతడు ఇంట్లోనున్న ఆనందాన్నంతా కొల్లగొట్టుకుపోయాడు. అస లతడే స్వయంగా యింటియొక్క ఆనందం. మహారాజుల గోరీలాగున్న దిప్పు డీయిల్లు. అలంకారాలుంటవి గాని ఆత్మవుండదు.

అతని కుమారుడు—ఆనంద్—

ఇరువది రెండు సంవత్సరాల క్రిందట అతనికి ఆనంద్ అనే నామకరణంచేశాడు. కుమారుడు జన్మించినాడనగానే అతనికి జీవితములో ఎన్నడూ కలుగని ఆనందం కలిగింది. అందుచే అతనికి ఆనంద్ అని నామకరణం చేశాడు. నిజంగా ఆనంద్ అతనిజీవితానందుడే. అదీగాక ఆనంద్ జన్మించిన నాడే జిల్లాకోర్టులో కృష్ణసింహుడు మొదటికేసు గెలిచాడు. బార్ ఎసోసియేషన్ టీపార్టీచేసి ఎంతో అభినందించింది. ఆనాటినుండి ఫైలుగూడా పెరిగింది. అన్నింటికీ మించిన విషయమేమంటే అన్యాయంగా ఉరికంబ మెక్కించబోతున్న ఒకఅభాగ్యజీవిప్రాణాలుకాపాడాడు ఠాకూర్ జీ. ప్రత్యామ్నాయంగా అతడు హృదయపూర్వకంగా, కృతజ్ఞతాసూచకంగా

సమర్పించిన వందనంతో సంతుష్టిచెందాడు. ప్లీడరువృత్తి కేవలం ధనసంపాదనకొఱకే కాదు. ఇలాంటి అభాగ్యజీవులకు న్యాయం, ధర్మం కలిగించడానికని నిశ్చయించుకొన్నాడు.

మహాత్మా గాంధీజీ పిలుపుతో అతని యువకరక్తం పుప్పొంగింది. ఉద్యమంలో ప్రవేశించాడు. సర్వమానవ సౌభ్రాతృత్వం కొరకు ప్రాణాలనైనా సమర్పిస్తానని ప్రమాణం చేశాడు.

ఠాకూర్ కృష్ణసింహాజీ మొదటిదఫా జైలుకి వెళ్ళే నాటికి ఆనంద్‌కి నాలుగు సంవత్సరాలు, మూడు సంవత్సరాలు జైలులోవున్నా అతను ఒక్క పర్యాయము గూడా ధైర్యాన్ని కోల్పోలేదు. గాబరాపడలేదు. కర్తవ్యతావిమూఢుడు కాలేదు. దేశస్వాతంత్ర్యం అనే దివ్యసంకల్పంలో అతను భార్యను, ఏకపుత్రుని మరచిపోయినాడు. కష్టాలను లెక్కజేయడంలేదు. కాని కొద్దిరోజులలో విడుదల అవుతాడనగా ముద్దుబిడ్డ ఆనంద్ తప్పులు, తప్పులుగావ్రాసిన ఉత్తర మొకటి అందింది.

'ప్రియమైన నాన్నగారికి——'

బాలభానుని అరుణకిరణాల్లా యీ అంక్షరపంక్తులతని హృదయసీమలో మధురస్మృతులను జాగరితం చేశాయి. తన ముద్దుల ఆనంద్ తల్లి ఒడిలో కూర్చుని చిరునవ్వు వెన్నెల లొలకబోస్తున్నట్లు, తను ఇంతకాలంగా తనను ఎత్తుకొని ముద్దాడనందులకు కోపిస్తున్నట్లు, యింకా ఎన్నో ఎన్నో మధురస్మృతులు అతన్ని చుట్టుముట్టాయి. ఒక్క క్షణకాలం ఠాకూర్‌జీ తననుతాను మరచిపోయినాడు. తన కర్తవ్యాన్ని

మరచాడు. తలుపులు బ్రద్దలుకొట్టుకొని పారిపోదామాఅను కొన్నాడు. కాని యింకా నాలుగుపంక్తులు క్రిందకు చదివే సరికి తనకుతానే ఆ క్షణిక దౌర్బల్యానికి సిగ్గుపడ్డాడు.

'ప్రియమైన నాన్నగారికి——

అమ్మనుగురించి మీరేమీ భయపడకండి. నేను ఆమె చెప్పినట్లు వింటూ ఆమెను జాగ్రత్తగా కనిపెట్టి వున్నాను. అమ్మ అంటుందిగదా —బాబూ! నీవుకూడామీ నాయనగారి అంతటివాడివి కావాలని. నేనుగూడా మీలాగే విప్లవకారుణ్ని కావాలనుకొంటున్నాను. మీ ఆనంద్ నిజంగా విప్లవకారుడౌతాడు. మీలాగే దేశంకొరకు పోరాడుతాడు.' ఈపంక్తులు చదివేసరికి ఠాకూర్‌జీకి కన్నుల వెంట ఆనందాశ్రువులు కారజొచ్చినవి.

ఒక్కవారం రోజులు గడచిన తరువాత తన భార్య రాధకు జబ్బుగావున్నదని కుమారునివద్దనుండి మరొక ఉత్తరము వచ్చినది—— 'అమ్మకు చాలాజబ్బుగానున్నది——మాటి మాటికి మిమ్ములను కలవరిస్తున్నది——కొంతమంది సలహా ఏమంటే మీనాయనగారు భార్యకు జబ్బుగా నున్నదని పది రోజులు పెరోలుమీద విడుదలై వస్తే బావుండునంటున్నారు' ఈ ఉత్తరము చూడగానే ఠాకూర్‌జీ మనసు మెత్తబడింది. పెరోలు దరఖాస్తు పెట్టడానికి కాగితం కలం తీసుకొన్నాడు. ఇంతలో భార్యవద్దనుంచి ఆమె వణుకుతున్న చేతులతో వ్రాసిన మరోఉత్తరం చేరింది. 'మీరు నన్నుగురించి ఎంత మాత్రం బాధపడకండి. ఏ పరిస్థితులలో గూడా మీశిరస్సు వంచకండి. మిన్నువిరిగి మీదపడినా బ్రిటిషు సర్కారుని

విడుదలచేయండని యాచించకండి. మన భాగ్యంలో వ్రాసివుంటే మీరు విడుదల కాగానే కలుసుకొందాము' ఉత్తరము చదివి ఠాకూర్ దరఖాస్తుఫారం చించి పార వేశాడు.

గాంధి, ఇర్విన్ ఒడంబడిక జరిగిన తరువాత, ఇతర కాంగ్రెస్‌వారితోపాటు ఠాకూర్‌జీగూడా విడుదలైనాడు. ఆయన యింటికి రాగానే కుమారుడు ఆనంద్ అశ్రుపూరిత నయనాలతో స్వాగతమిచ్చాడు. 'నాన్నా! అమ్మ చనిపోయింది' అని చెప్పగలిగాడు. మాటుమాటాడలేకపోయాడు.

అటుపిమ్మట ఆ యింటిలో యిరువురూ తండ్రి కొడుకులవలెనేగాక స్నేహితుల్లా మెలగసాగారు. ఠాకూర్‌జీ సాయంకాలం కోర్టునుండి యింటికిరాగానే ఆనంద్‌ని పిలిచి యిలా ప్రశ్నించేవాడు. 'చూడు ఆనంద్, ఇవ్వాళ మీస్కూల్లో విశేషాలేమిటి?' అని అడిగేవాడు. వెంటనే ఆనంద్ తడుముకోకుండా 'నాన్నగారూ! ఇవ్వాళ మా మాష్టరుగారి మేక రెండు పిల్లలను పెట్టింది. నేను నేరేడుచెట్టు ఎక్కి కొమ్మ విరిగి క్రిందపడ్డాను. ఇదిగో చూడండి, మోకాలికి దెబ్బ తగిలింది. ఇవ్వాళ మాస్కూలుముందునుంచి ఒక బ్రిటిషు పటాలంపోయింది. అంతా కోతుల్లాగున్నారు. వాళ్లు మావంక మింగేద్దామా అన్నట్లు చూచారు. పిల్లలంతా భయపడి పారిపోయారు. కాని నేనుమాత్రం పారిపోలేదు నాన్నా' అనేవాడు. 'సెబాస్ బాబూ! నీవు చాలా ధైర్యశాలివి. పారిపోవడం పిరికివాని లక్షణం. నాకు నీయందట్టి విశ్వాసమున్నది' అంటూ వీపు చరిచేవాడు ఠాకూర్‌జీ.

ఆనంద్ పదిసంవత్సరాల కుర్రవాడై వుండగా ఒక నాడు బడినుంచి ఇంటికివచ్చి తండ్రితో 'నాన్నా నేను బడి నుండి వెళ్ళగొట్టబడ్డాను' అన్నాడు. నేను గాంధీటోపి పెట్టుకొని బడికిపోతున్నానని మా హెడ్‌మాస్టరుగారు చాలాసార్లు కోప్పడ్డారు. ఇవ్వాళెవరో ఇన్‌స్పెక్టరట - మా స్కూలుకు వచ్చాడు. నా గాంధీటోపి చూచి నావెంటబడ్డాడు. బ్రిటిషు సర్కారును గురించి నీకు తెలిసిన విషయాలు నాలుగు చెప్పమన్నాడు. మహాత్మాగాంధి, జవహర్‌లాలు, పటేలు, మా నాన్నలాంటి వాళ్ళను అనేకమందిని జైల్లో పెట్టింది-అని చెప్పాను. ఆయన మండిపడి నారెండుచేతులమీద ఆరేసి దెబ్బలుకొట్టాడు. అన్నిదెబ్బలు కొట్టినా నాకంటివెంట నీరు రాలేదునాన్నా! ఇంకాచూడు, చేతులెలా కందిపోయాయో' అంటూ తన చేతులను తండ్రికి చూపించి కౌగలించుకొని ఏడ్చాడు.

ఇంతకాలం గతించినా ఈవిషయం దృష్టికి వచ్చినప్పుడల్లా ఠాకూర్ కంట నీరుపెట్టుకొంటాడు.

చదువుకొరకై ఆనంద్‌ని హైస్కూలుకు పంపించి ఠాకూర్ యింటిలో ఒంటరిగా వుంటున్నాడు. లాపుస్తకాలు తిరగవేస్తూనో, కక్షిదారులతో కోర్టువ్యవహారాలు మాట్లాడుతూనో, స్థానిక రాజకీయాలతోనో కాలం గడిపేవాడు. ఆయనగారి ఫైలిప్పుడు బాగా పెరిగిపోయింది. బార్‌లో మంచిపేరు సంపాదించాడు. సాలీనా ఆదాయం వేలలో నుండి లక్షలలో పడింది. ఇప్పుడాయన వకాల్తా పుచ్చుకోబోయేముందు నేరస్థుడు దోషియా, లేక నిర్దోషియా అని

కాదు విచారించేది. అతడు తను అడిగినంత ఫీజు యివ్వ గలడా లేదా అనే విచారిస్తాడు.

ఠాకూర్ సాహెబ్ అన్నివిధాల ఉచ్ఛస్థానంలో నున్నాడు. జిల్లాకోర్టునుండి హైకోర్టుకి, మున్సిపల్ కౌన్సిలర్ నుండి చైర్మను పదవికి, తాలూకా కాంగ్రెస్ కమిటీనుండి జిల్లాకాంగ్రెస్ ప్రెసిడెంటుగిరీకి వచ్చాడు. వచ్చేఎన్నికలలో రాష్ట్రకాంగ్రెస్ కమిటీ మెంబరుషిప్పుకి పోటీచేయాలనుకొం టున్నాడు. రానున్న శాసనసభా ఎన్నికలకు కాంగ్రెసు తరఫున నిలవాలనుకొంటున్నాడు.

సెలవుల్లో ఆనంద్ యింటికివస్తే తన ఉన్నతిని చూచి ఎంతో ఆనందిస్తాడనుకొన్నాడు ఠాకూర్. అతని ట్రంకు పెట్టెలోనేకాదు, అతని ప్రక్కచుట్టనిండావున్న పుస్తకాలను చూచి ఇతర పిల్లవాండ్రిలా మా ఆనంద్ సినిమాలకూ, నాటకాలకూ కాలాన్ని వ్యర్థంచేయడంలేదని భావించాడు. కాని అందులో క్లాసుపుస్తక మొక్కటీ లేకపోవడంచూచి ఆశ్చర్యపడ్డాడు. అన్నీవివిధదేశాలలో జరిగినవిప్లవచరిత్రలు. 'సెబాస్ బాబూ! నీవుగూడా నీ తండ్రిలా రాజకీయవేత్త వవుతావు' అన్నాడు ఠాకూర్.

'నేను రాజకీయవేత్తను కావాలని కోరుకోవడంలేదు. విప్లవకారుణ్ణి కావాలనుకుంటున్నా' నన్నాడు ఆనంద్.

'విప్లవం రావాలని అంతా కోరుకొంటున్నాము.' అన్నాడు ఠాకూర్.

ఈమాటమీద ఎందుకో ఆనంద్‌కి విశ్వాసం కలుగ లేదు.

జమీందారుగారు శిస్తు బకాయి చెల్లించకపోతే ఆయన జవాను తనను పట్టుకుకొట్టినాడని పాప మెవరో రైతు ఠాకూరుగారితో మొరపెట్టుకొన్నాడు. పైగా తనపొలం కాస్తా ఊడబెరుకుకొన్నారనీ, తమరు కోర్టులో దావావేసి తనకు న్యాయం కలిగించాలనీ వేడుకొన్నాడు. 'నా పొలం నా కిప్పించండి. మీపేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటాను.' అని కాళ్ళుపట్టుకున్నాడు.

'అయితే ఫీజేమైనా తెచ్చినావా?' అన్నాడు వకీల్.

పాపం రైతు వణకుచున్న చేతులతో బొడ్డునున్న అయిదు రూపాయలు తీసి ఠాకూరుగారి కివ్వబోయినాడు. ఆయన మండిపడి జవానును పిలిచి 'యితనిని బయటికి గెంటండిరా' అన్నాడు. ఇంతలో ఆనంద్ ఎక్కడనుంచో లోపలకు వచ్చి సంగతేమిటని తండ్రి నడిగాడు.

'ఈ వెధవ అయిదురూపాయలు తీసుకొనివచ్చి జమీందారుగారిమీద దావా వేయమంటున్నాడు, దావా.'

'అయితే నాన్నగారూ! మీరు పేదరైతు వకాల్తా ఎందుకు పుచ్చుకోరు?'

'దమ్మిడీలేదట. దావా వేయాలట, దావా— ఇక్కడెవరూ తీరిగ్గా కూర్చోలేదు.'

'నేను వకీలుగారి జవాబుకాదు కోరేది. నాన్నగారి జవాబు.'

'డబ్బులేకుండా దావాజరగదని నాన్నగారే చెప్పేది.'

'అయితే ఫీజు నే నిస్తాను ఆకేసు నడపండి.'

'ఈ కేసు నేనుతీసుకోను, ఈ రైతులంతా ఎవరి ప్రజలో నీకు తెలుసునా? మీతాతగారి మీనాయనగారి ప్రజలు—'

'అయితే మీరు వీరిని న్యాయానికి దూరంచేస్తారా?'

'నీకు తెలియదు ఊరుకో. ఇది మనవక్కరికి సంబంధించిన విషయమేకాదు. జమీందారులందరకు సంబంధించిన విషయం. ఇలా వాళ్ళకు సందిచ్చామంటే నెత్తికెక్కి కూర్చుంటారు. ఈనాడు జమీందారుల కెదురు తిరిగారు. రేపు మన కెదురు తిరుగుతారు.'

'ఆరోజు తప్పకవస్తుంది.'

'నీ పిల్లచేష్టలు మానేయ్.

'పిల్లకాయల మాటలుకావు నాన్నగారూ! మీరు నిరంతరం బయట అనే మాటలే యింట్లో నే నంటున్నది.'

ఈ కారణంగా సెలవులు పూర్తిగాకముందే ఆనంద్ తిరిగి బనారస్ వెళ్ళిపోయినాడు. మాటసామెతగా నన్నా ఠాకూర్ సాహెబ్ అతన్ని అభ్యంతరం పెట్టలేదు.

ఇన్ని సంవత్సరాలు గతించినా ఆఘట్టం నేటికీ ఠాకూర్ జీకి కన్నులకుకట్టినట్లు కనిపిస్తూనే వున్నది.

ఆరోజునుంచే తండ్రి కొడుకు లిరువురి మధ్యా రాజకీయంగా పెద్ద అగాధమేర్పడింది. ఇరువురి మధ్య రాజకీయ వివాదం జరిగితే అత నేదో లోకాన్నుండి యిప్పుడే దిగాడా అనిపించేది ఠాకూర్ జీకి.

ఠాకూర్ జీ రాష్ట్రికాంగ్రెస్ కమిటీ మెంబరు, యం. యల్. ఎ. గూడా అయినాడు. కాని ఆనంద్ ఏవిధమైన సంతోషాన్ని వెలిబుచ్చలేదు. తరువాత కొద్ది రోజులకే

ఆనంద్‌కు ఆలిండియా డిబేట్‌లో మెడలొచ్చింది. ఠాకూర్‌జీ ఏవిధమైన ఆనందాన్నీ ప్రకటించలేదు. కారణం, మాట్లాడిన విషయం 'సోషలిజం ద్వారానే భారతదేశానికి విముక్తి' అని.

అందుచేత ఠాకూర్ ఆనంద్‌ని అభినందించలేకపోయాడు.

ఠాకూర్ పార్లమెంటరీ శెక్రెటరీ అయినాడు. ఆనంద్ రాష్ట్రవిద్యార్థి ఫెడరేషన్ శెక్రటరీ అయినాడు.

ఠాకూర్ కృష్ణసింహ యం. యల్. ఏ. నరేంద్ర మండలి సభకు అధ్యక్షత వహించాడు. ఆనంద్ సోషలిస్టు పార్టీ మహాసభకు అధ్యక్షత వహించాడు.

ఠాకూర్ కృష్ణసింహ యం. యల్. ఏ. క్షత్రియ మహాసభలో ఉపన్యసించాడు. ఆనంద్ యీ కులతత్వాలు, మతభేదాలు నశించాలని సోషలిస్టుపార్టీ మీటింగులో ఉపన్యసించాడు.

ఠాకూర్ కృష్ణసింహ యం. యల్. ఎ. ఒక మహారాజుగారి కేసునుగురించి ప్రీవీ కౌన్సిలులో వాదించడానికని యింగ్లండు వెళ్ళి లక్షరూపాయలఫీజుతో తిరిగివచ్చాడు. విప్లవకారుడనే కారణంగా ఆనంద్ కళాశాలనుండి వెడలగొట్టబడినాడు.

వ్యక్తిసత్యాగ్రహం ప్రారంభమైంది. ఇతర సత్యాగ్రహుల మాదిరిగానే ఠాకూర్ కృష్ణసింహ యం. యల్. ఎ. గూడా నేను పలానిరోజున, పలానచోట, పలాని గంటకు సత్యాగ్రహము చేయబోతున్నానని పోలీసు సూపరింటెండెంటుకి తెలియపరచాడు. పోలీసు సూపరింటెండెంటు ఠాకూర్

జీవి మర్యాదగా అరెస్టుచేశాడు. ఏ క్లాసుకైదీగా జైల్లో పెట్టారు. మూడుమాసములతర్వాత ఠాకూర్ కృష్ణసింహ జైలునుంచి విడుదలై ఖద్దరుప్రచారం ప్రారంభించాడు. యుద్ధం ప్రారంభంకాగానే తన స్నేహితుని పేరుమీద సైనికులకు బూట్లు సప్లయిచేసే కంట్రాక్టుఒకటి సంపాదించాడు. దీనిలో అతనికి అనేకలక్షలు లాభంవచ్చింది. ఆనంద్‌యుద్ధానికి వ్యతిరేకంగా ఒక ఊరేగింపును బయలుదేరదీశాడు. పోలీసులు లాటీచార్జిచేశారు ఎవడోసైనికుడు ఆనంద్‌ని బూటు కాలితో తన్నాడు. బహుశా ఆ బూటు వాళ్ళనాన్న సప్లయి చేసిందేనేమో!

1942 ఆగష్టు 9 వ తేదీని నాయకులందరితోపాటు ఠాకూర్ కృష్ణసింహ యం. యల్. ఎ. ని గూడా స్పెషలు ట్రెయినులో ఎక్కడో అజ్ఞాతప్రదేశానికి తీసికొనిపోయి పురాతనఖిల్లాలో రాజుగారి అతిథిగా బంధించారు. ఆ తేదీనే ఆనంద్ బొంబాయిలో లాటీదెబ్బలుతినిఅరెష్టుచేయబడినాడు

రాజుగారి అతిథిగాఉన్నరోజుల్లో ఠాకూర్‌జీ భగవద్గీత చదివేహాడు. జైలులో ఆనంద్ కారల్‌మార్క్సు పుస్తకాలు చదివేవాడు.

రాజుగారి అతిథిగావున్నరోజుల్లో ఠాకూర్‌జీకి యింటివద్ద జరిగినట్లుగానే జరిగేది. బయటనుండి ఏమితెప్పించుకోవాలన్నా తెప్పించుకొనేందుకు సర్కారువారు అనుమతించారు. ఆనంద్ ఇతర రాజకీయఖైదీలతోపాటు పదిహేనురోజులు నిరాహారదీక్ష పూనాడు.

రాజుగారి అతిథిగావున్నరోజుల్లో ఠాకూర్‌జీ బరువు పది పౌనులు పెరిగింది. జైల్లో నిరాహారదీక్ష పూనిన కారణంగా ఆనంద్ తూకం పదిహేను పౌనులు తగ్గిపోయింది.

ఆనంద్ జైలులోనుండి తప్పించుకొని పారిపోయి విప్లవం లేవదీశాడు. ఒకసారి పోలీసులతో జరిగినపోరాటంలో తుపాకిగుండు ఆనంద్ కాలిలోగూండా దూసుకుపోయింది కాని పట్టుబడలేదు.

తరువాత ఆనంద్ జబ్బుపడి ఒక కుగ్రామంలో ఒక పేద్దరైతు యింట తలదాచుకున్నాడు.

'నేను నాకుమారుని విప్లవపంథాను నిరసిస్తున్నాను. ఇలాంటి తలదిరిగిన యువకులంతా దేశానికి ద్రోహం చేస్తున్నారు.'

అని తన తండ్రి పత్రికలలోచేసిన ప్రకటన చూచాడానంద్.

తరువాత కొద్దికాలానికి సర్కారువారికి 'కాంగ్రెస్‌కి రాజీకుదిరింది. ఇతరరాజకీయఖైదీలతోపాటు ఠాకూర్‌జీ కూడా విడుదలైనాడు. కొద్దిరోజులకు ఆనంద్‌మీద నున్న వారంటుకూడా రద్దయినది. తండ్రిని కలుసుకోవాలని, కొద్దికాలము విశ్రాంతితీసుకోవాలనీ ఆనంద్‌తండ్రివద్దకువచ్చాడు. అజ్ఞాతవాసము, నిరాహారదీక్ష కారణంగా ఆనంద్ చాలా చిక్కిపోయాడు. బొమికలగూడులాగున్నాడు. ఆనంద్‌ని చూడగానే ఠాకూర్‌జీకి కన్నులవెంట నీరుకారజొచ్చినది. ఒక్కక్షణకాలం యిరువురూ రాజకీయవిభేదాల నన్నింటిని మరచి ఒకరినొకరు కౌగలించుకొన్నారు.

హిందూదేశము విభజింపబడినట్లుగా జూన్ 3వ తేదీన ప్రకటన జరిగింది. దేశంలో మతకలహాలు చెలరేగినవి. ఈ విద్వేషాగ్ని చల్లార్చే ప్రయత్నంలోవున్నాడు ఆనంద్. అండర్ గ్రౌండ్‌లో వుండగానూ, జైల్లోనున్నప్పుడూ తనకు స్నేహితుడైన ఒక ముస్లిం, బీహారులో ఒక పల్లెటూరులో చిక్కుపడితే అతనిని ఎలాగో రక్షించి తనయింటికి తీసుకొని వచ్చాడు ఆనంద్ — యెన్ని రాజకీయవిభేదా లున్నా కాంగ్రెస్‌వాదియైన తనతండ్రి యీ ముస్లింకుటుంబాన్ని రక్షిస్తాడనే ఆశతో.

'తురకవాణ్ణి తీసికొనివచ్చి యింట్లో దాచామని అందరూ గొల్లున చెప్పుకొంటున్నారు. వాళ్ళ నెక్కడికైనా పంపించు'అన్నాడు ఠాకూర్.

'వారు ముస్లిములు కారు, దేశభక్తులు.'

'అగుగాక, ఈనాడు పాకిస్థాన్‌లో ఏమిజరుగుతున్నదో తెలుసా?' అన్నాడు దేశభక్త ఠాకూర్.

'ఇక్కడ యీదేశంలో మీ మనస్సులలోఏమిజరుగుచున్నదో అదే పాకిస్థానులోగూడా జరుగుచున్నది'అన్నాడు ఆనంద్. ఆరాత్రే ఆ ముస్లింకుంటుబాన్ని తీసికొని ఆనంద్ యెక్కడికో వెళ్ళిపోయాడు.

ఇప్పటికిగూడా ఆ సంఘటనలన్నీ సినిమారీల్సులాగా అతనికండ్లముందు తిరిగిపోతున్నవి.

'నీ చనువు చూచుకొనే అత నిలా విప్లవకారుడుగా తయారైనాడు.' అని ఠాకూర్‌జీ మిత్రులు కొంతమంది అన్నారు. 'యువకరక్తం అలానే ఉప్పొంగుతుంది. చిన్న

తనంలో అందరమూ అలా చేసినవారమే. ఆ యవ్వనపు పొంగు తగ్గిపోగానే వాడే తిరిగివస్తాడు.' అన్నాడాయన.

కాని అతను తిరిగిరాలేదు. వచ్చినా పుత్రుడుగా రాడు-శత్రువుగావస్తాడు. దేశభక్త ఠాకూర్‌జీ మంత్రిపదవికి ప్రయత్నించలేదు-రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీనుండి గూడా తప్పుకొన్నాడు-ఎక్కువకాలం ప్లీడరీతో నెగడుపుతున్నాడు-ఎప్పుడైతే జమీందారీ రద్దుబిల్లు రాబోతున్నదని తెలుసుకొన్నాడో తనకున్న కొద్దిపాటి జమీందారీ భూముల్ని అమ్మి మిల్లులలో షేర్లు కొన్నాడు..తన వ్యక్తిగత పలుకుబడిని వినియోగించి గవర్నమెంటు కంట్రాక్టులు మొదలైనవి సంపాదించాడు.కొద్దిరోజుల్లోనే దేశభక్తఠాకూర్ సేట్‌ఠాకూర్‌గా మారిపొయ్యాడు—ఇంతలో యెంతమార్పు!

కొద్దిరోజుల తర్వాత ఠాకూర్‌జీ మిల్లులో సమ్మె ప్రారంభమైంది. పని ఆగిపోయింది. నష్టంవచ్చేలాగున్నది. నయానా, భయానా కూలీలను బెదరించిచూచాడు. లాభం లేకపోయింది. రాజీప్రయత్నాలు జరిగినవి. కూలీలతరఫున ఆనందే రాజీ చేసుకోడానికి వచ్చాడు. ఆనందుని చూచేసరికి ఠాకూర్‌జీ ఆశ్చర్యానికి మేరలేదు. ఎంత విప్లవకారుడైనా అత డతని కుమారుడు కాకపోలేదు. తండ్రిలో పుత్రప్రేమ అంకురించింది. కౌగలించుకోబోయాడు.

'నేను బాంధవ్యాన్ని తిరగవేయడానికి రాలేదు. మీరు నాతండ్రిగారైనకారణంగా మీకు రానున్న ఆపదను తెలియజేయడానికి వచ్చాను.' అన్నాడు ఆనంద్.

'ఆపద—'

'ఆఁ, అవును. ఆపద. బలవంతమైన......కూలీలంతా ఏకమై తననుచంపడానికి వస్తున్నారు కాబోలు-ఆవిషయాన్ని తెలియజేయడానికే ఆనంద్ పరుగెత్తుకొనివచ్చాడుకాబోలు' అనుకొన్నాడు ఠాకూర్.

'మీ ప్రాణానికి కాదు అపాయం! మీ సర్కారుకి, మీసమాజానికి' అన్నాడు ఆనంద్.

'చూడు ఆనంద్! ఇదంతా ఎవరికోరకంటావ్-నీకొరకు కాదూ? నేనింకా ఎన్నోదినాలు బ్రతకను. నాకు రోజులు దగ్గరపడుతున్నాయి.'

'మీకేకాదు నాన్నగారూ! మీ పెట్టుబడిదారీవిధానానికి, మీ బ్లాక్‌మార్కెటుకు, మీఆర్థికవ్యవస్థకు రోజులు దగ్గరకొచ్చాయి. ఈధనాన్నిచూపి నన్ను మోహపెట్టకండి. ఎంతమంది ప్రజలన్నంలేక అలమటిస్తున్నారో కొంచెం కన్ను తెరచి చూడండి. ఈధనాన్ని ప్రజాకార్యములకు వినియోగించి ప్రిలలమన్ననలనుపొందండి-ప్రజాశక్తిని గుర్తించండి.'

ఈ మాటలువిని ఠాకూర్‌సాహెబ్ మండిపోయాడు- 'చూడుఆనంద్! నీకు నాఆస్థిలో పూచికపుల్లయినాయివ్వను. నీతో సంబంధాన్ని యీరోజునే త్రెంచుకొంటున్నాను.'

'మిమ్ములను కష్టపెట్టడం భావ్యంకాదనే నేను మిమ్ములను, మీపెట్టుదారీవిధానాన్ని ఎప్పుడో వదలుకొన్నాను.'

ఠాకూర్‌కోపాన్ని ఎలాగోదిగమ్రింగి ఎలాగైనా కొడుకును వలలోవేసుకోవాలని తన లాయరుఎత్తులన్నీ వేసిచూచాడు 'చూడు ఆనంద్. నేను నీతండ్రిని. నీమంచికొరకు

చెబుతున్నాను. ఆ కమ్యూనిస్టు సోషలిస్టు భావాలువదలిపెట్టు. కుమారుడు తండ్రిమాట విధిగా వినాలి.'

'నిజమే నాన్నగారూ! తండ్రిచెప్పిన ప్రతిమాటా కొడుకువొప్పుకుంటే ప్రపంచములో మానవత్వంనశించి పశుత్వం ప్రబలిపోతుంది-మన పూర్వుల ఆచారం ప్రకారం రాతికి రాయో, లేక కట్టెకు కట్టో వేసికొట్టి నిప్పు రాజేయాలంటే మనమొక వేయిసంవత్సరాలు వెనక్కుపోతున్నామన్నమాట. ఈ భూమి బల్లపరుగాపున్నది. ఈరాళ్ళన్నీ దేవుళ్ళేఅనేది వదలిపెట్టండి! కాలాన్నిగుర్తించండి. అజ్ఞానాన్నిపారద్రోలండి.'

వాదించి లాభంలేదని గ్రహించాడు ఠాకూర్ — 'చూడు ఆనంద్, వ్యక్తిగతంగా నాకున్న పలుకుబడినిబట్టి నీవింతవరకు అరెస్టుకాలేదు. సరిగా రాజీకుదిరిందా కుదిరింది, లేదా పోలీసులకు కబురుచేస్తాను—ఆపైన జరిగేదానికి నేను ... ...'

'మీరు చేయించగలిగినదంతా చేయించండి - నన్ను అరెస్టుచేయించండి. కూలీలను తుపాకులతో కాల్పించండి— పాపం మీరు విధిలేక చేయించవలసివచ్చిన పనులల్లా చేయించండి.'

'ఈవదరుబోతు, ఈతుచ్ఛుడు నా కుకుమారుడా! ఎప్పటికీ కాడు-వెళ్లు నాకళ్ళముందునుంచి వెళ్ళిపో—ఈరోజునుండి నేను నీకుతండ్రినికాను, నీవు నాకు కొడుకువికావు. వెళ్లు; నీలాంటి దౌర్భాగ్యులముఖం చూడగూడదు. ఇంక నాకు నీ ముఖం చూపించకు' ఠాకూర్ జీ కఠోరస్వరం యిల్లంతా ప్రతిధ్వనించింది.

'మంచిది. ఇంక మీరు నాముఖమెన్నటికీచూపించను' అంటూ అతను వెళ్ళేటప్పుడు చినిగిపోయి, పాలీషులేని అతని బూట్లచప్పుడులో నిశ్చయత్వము, దృఢసంకల్పము గోచరించాయి.

బీదరైతు దావా తీసికోకపోవడమూ, ఇంట్లోనుండి ముస్లింకుటుంబాన్ని వెళ్ళగొట్టటమూ, తనస్వరక్షణ కొరకు ఆనంద్‌కీ, అతని విప్లవపంథాకూ, తనకూ సంబంధంలేదని పేపర్లలో ప్రకటించడమూ సినిమారీల్సులా తిరిగిపోయాయి ఠాకూర్ దృష్టిలో.

ఠాకూర్‌జీ యింట్లోనుంచి వెళ్ళగొట్టినది శత్రువుని కాదు, తనఆత్మను–చూడు నాన్నా, పంతులుగారెలాకొట్టారో అని కందినచేతులను చూపిన తనకుమారుణ్ణి. తానుజైలులో వుండగా చిట్టిచేతులతో 'నాన్నా! నీలాగే నేను విప్లవకారుడనౌతాను' అనిఉత్తరంవ్రాసిన పుత్రరత్నాన్ని. ఒక్కపుత్రునేకాదు. 'మీరు జైలునుండి విడుదలకాగానే బ్రతికివుంటే కలుసుకొందాము. మీరు సర్కారువారి ముందు శిరము వంచకండి' అని ధైర్యంచెప్పినభార్యనిగూడాకోల్పోయాడు. భార్యను కుమారుణ్ణి పోగొట్టుకొని అతనిప్పుడు ప్రపంచంలో ఒంటరిజీవితాన్ని గడుపుచున్నాడు. కృష్ణసింహుని తండ్రి యింకా జీవించేవున్నాడు. ఆయన తన స్వగ్రామంలోనే వుంటున్నాడు. అది ఒక చిన్నపల్లెటూరు. హృదయంలోబాధ ఒక్క తల్లిదండ్రులుమాత్రమే గుర్తిస్తారు. అందుచే ఠాకూర్ తనకష్టసుఖాలను తండ్రితో చెప్పుకోడానికై షెడ్‌లోనుండి

కారు బయటకుతీసి దుమ్ము రేపుకొంటూ పల్లెటూరివైపు బయలుదేరాడు.

హారను మోత వినగానే ఠాకూర్ కృష్ణసింహుని తండ్రి సేవకునిపిలిచి 'నీకు వేయిసార్లు చెప్పాను. బుద్ధిలేదు. రాక్షసుల రథాలను యీవైపు రానివ్వద్దురా అని' ఆయన వయస్సు ఎనభై య్యోపడిలోపడింది. పండ్లూడిపోయినవి. ఆబోసినోటితో తొస్సిబోకుండాఅన్న ఆమాటలు యిల్లంతా ప్రతిధ్వనించాయి. ఆయనకు కండ్లు కనిపించకపోయినా విదేశపు కండ్లజోడు వుపయోగించవలసివస్తుందని అలాగే కాలం గడుపుతున్నాడు. కృష్ణసింహుడు ఎదురుగావచ్చినిలబడినాడు కాని ముసలిఠాకూర్ గుర్తించలేదు.

'ఎవరు నీవు?'

'నేను కృష్ణ'

'కృష్ణపరమాత్ములా? ఈరాక్షసులరథంమీద ...?'

నేను కృష్ణపరమాత్మను కాను, నీకుమారుణ్ణికృష్ణసింహ.

'నా కెవరూ కుమారులులేరు. నేనెవరికీ తండ్రినికాను.

ఇరువదిఅయిదు సంవత్సరాలకిృందట తానువలదన్నా వినక కృష్ణసింహ సత్యాగ్రహంలో పాల్గొని జైలుకి వెళ్లాడు. ఆనాడే నీవు నాకు కొడుకువికాదు. నేను నీకు తండ్రినికాన న్నాడు కృష్ణసింహునితండ్రి. ఆనాటినుండి ఆయనకు మతి స్థిమితంలేదు. అలానే పల్లెటూరిలో జీవితంవెళ్ళదీస్తున్నాడు. నాన్నగారూ! నన్ను గుర్తించలా? నేను కృష్ణసింహను. మీతో మాట్లాడాలని వచ్చాను. నాకుమారుడు ఆనంద్ ఇల్లువదలి వెళ్ళిపోయాడు.

'అవును, అవును, కృష్ణ ఇల్లువిడిచిపోయాడు. నేనే అతనిని బయటకు పంపాను.'

'వాడు కూలీలకు నాయకుడై నా ఫ్యాక్టరీలో సమ్మె చేయించాడు. వాడితండ్రి తన హృదయబాధను మీతో చెప్పుకోడానికై వచ్చాడు.'

ఇదంతా గాంధీగారిమాయ. యువకులందరినీ వలలో వేసుకున్నాడు. ఈవిషయం స్వయంగా కలెక్టరుగారే నాతో చెప్పినారు.

'నేను ఆనందువిషయంమాట్లాడుతున్నాను నాన్నా.'

'మీరు భయపడకండి కలెక్టరుగారూ! నేను వాడిని కొంపలోనుండి వెళ్ళగొడతాను. నాకుమారుడు కాంగ్రెసులో కలిసి సత్యాగ్రహం చేశాడంటే మా వంశానికే అప్రతిష్ట. వాణ్ణిప్పుడే కొంపలోనుండి వెళ్ళగొడతాను.'

కృష్ణసింహాజీ తండ్రిని సరియైన మార్గంలో పెట్టాలని ప్రయత్నించాడు. 'నాన్నగారూ ఇది 1922సంవత్సరంకాదు. 1942 సంవత్సరం. నీ కొమారుడుకాదు. నీమనుమడు యిల్లు విడిచి సోషలిష్టుపార్టీలోచేరి జమీందారుల్ని పెట్టుబడిదారుల్ని నాశనంచేయాలంటున్నాడు.'

'నావిష్ణుః పృధివీపతిః' అన్నారు. వాళ్ళనెదిరించిన వాళ్లు నరకానికి పోతారు'.

'ఆరోజులు గతించాయి నాన్నగారూ! వాడిని నేను పెంచి పెద్దవానినిచేసి విద్యాబుద్ధులుచెప్పించికాళ్లుతెచ్చాను. ఇవ్వాళ వాడే నాకెదురుతిరిగాడు.

పాపం—అని ముసలి ఠాకూరు బిగ్గరగా అరిచాడు. తాను చెప్పేమాటలు గ్రహిస్తున్నాడని భావించాడు ఠాకూర్ కృష్ణసింహ. కాని ముసలివాడీలోకంలో లేడు — 'పాపం, బ్రిటిషువాళ్ళువచ్చి యీ జమీందారులను సృష్టించారు-మనం పెంచి పెద్దవారినిచేశాం-తిరిగి మనమే వారి నాశనం...అలా యెన్నటికీ జరగదు. జరగగూడదు.'

తాను జైలుకి పోబోయేముందు తండ్రిఅన్న యీ మాటలే గ్రామఫోనురికార్డులా కృష్ణసింహుని కర్ణపుటాల్లో ప్రతిధ్వనింపసాగినవి.

'నాన్నగారూ! మీరింకా వెనుకటిలోకంలో నేఉన్నారు. ఇంగ్లీషువాళ్ళు మనకు స్వాతంత్ర్యమిచ్చి వాళ్ళంతటవాళ్ళు మర్యాదగా తప్పుకొన్నారు. వాళ్ళతో మనకిప్పుడేమీ తగాదా లేదు. ఎటొచ్చీ యీ కమ్యూనిష్టులు, సోషలిష్టులు దేశములో కల్లోలాన్నీ—'

'ఇదంతా గాంధీగారు పెట్టిననిప్పు. ఇవ్వాళ అందరం కలిసి బ్రిటిషువాళ్ళను వెళ్ళగొట్టాం. రేపు రైతులు జమీందారులను వెళ్ళగొడతారు. ఎల్లుండి యింకొకరు రైతుల్ని—ఇలాఅగ్ని ఒక్కసారి ముట్టుకొన్నదా యికయెన్నటికీఆరిపోదు'

'నాన్నగారూ! వీళ్ళు వర్గపోరాటాన్ని లేవదీస్తున్నారు.

స్వాతంత్ర్యాన్ని కోరుతున్నారు - విప్లవం, విప్లవం అని భూనభోంతరాళాలు దద్దరిల్లేలా గర్జిస్తున్నారు. ఆయితే నీవు...ఒక ఠాకూర్ బిడ్డవైయుండి...ఈ వెధవలకు, ఈ విద్రోహులకు సాయం...?'

కృష్ణసింహాజీకి కోపంవచ్చింది తనతండ్రి తిరిగి పాత కాలపు మాటలే మాట్లాడుతున్నాడనుకొని బిగ్గరగా, 'నాన్నగారూ!...'

'జ్ఞాపకముంచుకో కృష్ణ! నా ఆస్తిలో నీకు చిల్లి గవ్వయినా ముట్టనివ్వను. నాయింటిలోనుండి వెళ్ళిపో...' అనే మాటలు ముసలివాని బోసినోటినుండి అప్రయత్నంగా వెలువడినవి.

ఈమాటలు ఎవరు, ఎప్పుడన్నారు? కృష్ణసింహాజీ ఆలోచించసాగాడు. దాదాపు పాతిక సంవత్సరాల క్రితం తన తండ్రి అన్నమాటలివి. తాను కొద్ది గంటల క్రితమే తన కుమారునితో సరిగా యీమాటలే అన్నాడు. అతని తల తిరగజొచ్చింది. నే నెవరిని? ఎక్కడ వున్నాను? ఏమి మాట్లాడుతున్నాను?

ముసలివాని కన్నులలో నీరుతిరిగింది. 'కృష్ణా! నేను నీ మంచికొరకై చెపుతున్నాను. ఈ కాంగ్రెసుని, ఈ గాంధీ గారిని విడిచిపెట్టు.' నేను నీతండ్రిని. తండ్రి మాట వినడం కుమారుని విధి.

'నిజమే నాన్నగారూ! తండ్రిజెప్పిన ప్రతిపనీ కొడుకు చేస్తే ప్రపంచములో మానవత్వం నశించి పశుత్వం ప్రబలిపోతుంది. సుందరప్రకృతి అంతా శ్మశానవాటికగాతయారౌతుంది. రాతికి రాయివేసి కొట్టి అగ్నిపుట్టించాలనీ, కనపడిన రాతికల్లా మ్రొక్కాలనీ, విషసర్పమైనా దానిని పూజించాలనీ, ఈభూమి గుండ్రంకాదు, బల్లపరుపుగా వున్న దంటే మనము వెనక్కు పోతున్నామన్నమాట నాన్నగారూ.'

'వెళ్లు, ఇక్కడనుండి వెళ్ళిపో. నేటినుండి నేను నీకు తండ్రినిగాను, నీవు నాకొడుకువుగావు.'

కృష్ణసింహాజీ హృదయంలో పెద్ద తుపాను బయలు దేరింది. తలతిరిగిపోతోంది.మతిచెడిన తన తండ్రిని ఒంటరిగా వదలివెళ్ళిపోయాడు.

ఇంటికి వచ్చేసరికి యింట్లో దీపాలన్నీ వెలుగు తున్నాయి. ఎవరికోరకో నిరీక్షిస్తున్నట్లు వాకిళ్ళన్నీ తెరచి వున్నవి.

ఇంట్లో ఎక్కడపెట్టిన వస్తువు లక్కడే నిశ్చలంగా వున్నాయి. గోడపైనున్న తన తాత తండ్రుల తైలచిత్రాలు తనను వెక్కిరిస్తున్నాయి. డ్రాయరుపైనున్న మహాత్మా గాంధి, మహాత్మా బుద్ధ విగ్రహాలు చిరునవ్వు వెన్నెలలు కురుస్తున్నవి.ఇనుపపెట్టెమీదనున్న ఖద్దరుటోపీ అలానే నిశ్చలసమాధిలో నున్నది. ప్రతివస్తువు నిశ్శబ్దంగా నిశ్చలంగా వున్నది. కాని గోడగడియారం టిక్కుటిక్కు మంటూ, క్యాలెండరు గాలికి రెపరెపలాడుతూ ఏదో సందేశాన్ని ఇస్తున్నాయి.

కృష్ణసింహ ఒక్కొక్కటనే నొక్కాడు. ఇల్లంతా అంధకార మావరించింది.

# అంతా మానవులం

అయితే నేనెందుకు నవ్వుతున్నానో తెలిసికోవలె ననుకొంటున్నారుకదూ మీరు? మరణశయ్యపై చావడానికి సిద్ధముగానున్న నే నెందుకు నవ్వుచున్నానో తెలిసికోవలె ననుకొంటున్నావుకదూ డాక్టర్! అంతేనా? డాక్టరుగారూ! మీరు విచారించి లాభంలేదు. దయచేసి మీరు వెళ్ళి రోగులకు క్వినైనుమిక్చరో, యాస్ప్రినుబిళ్ళలో యిచ్చుకోండి. మీరు నన్ను మృత్యుముఖాన్నుండి రక్షించలేరు. మీరేకాదు, ప్రపంచములోని ఏ డాక్టరూ, ఏ మందూ, ఏ శక్తీ నన్ను రక్షించలేవు. కారణం. నాశరీరంమీద రెండు బలమైన కత్తిపోట్లు తగిలాయి. ఒకటి వీపుమీదనుండి Abdomen వైపుకు. రెండవది పొట్టలో. ఇవిగో ప్రేవులు బయటకువచ్చి కనిపించడంలా మీకు?

అయితే నేనెందుకు నవ్వుచున్నానో తెలిసికోవలెననే ఆదుర్దాతో వున్నారుకదూ మీరు? మరణించడానికి సిద్ధముగానున్న వ్యక్తి ఎందుకు నవ్వుచున్నాడా అని మీ కాశ్చర్యముగా నున్నదికదూ? చెపుతా... నాకిప్పు డిప్పుడే స్మృతికి

వస్తున్నది… …నేనెవరినైనది… …నా కిప్పుడిప్పుడే గుర్తికి వస్తున్నది.

ఏమంటున్నారు? ఇందులో నవ్వదగినంత కారణమేమున్నదనా? సాంతముగా వినండి మరి. నేను మరణశయ్యపైనుండి ఎందుకు నవ్వుతున్నానో చెపుతా మరి. ఓహ్… ఓహ్.

నేనెవనినో తెలుసుకోవడానికై గత రెండు మాసాల నుండి ప్రియత్నం చేస్తున్నాను. మహమ్మదీయుడనా? హిందువునా… లేక సిఖ్ఖునా? బ్రాహ్మణుడనా? లేక శూద్రుడనా? భాగ్యవంతుడనా లేక బీదవాడనా? తూర్పు పంజాబునుండి వచ్చానా? లేక పశ్చిమ పంజాబునుండి వచ్చానా! నాది లాహోరా? లేక అమృతసరా? రావల్పిండా? లేక జలంధరా? కేవలం నేనేగాదు. చాలామంది నాఊరూ పేరూ,కులం,గోత్రం తెలుసుకోవలెనని ప్రయత్నం చేసి విఫలమనోరథులైనారు . నేనెవరినో తెలిసికోవలెనని నేనుగూడా ప్రయత్నం చేసినాను. కాని లాభంలేకపోయింది. నాకిప్పుడిప్పుడే… …చావడానికి సిద్ధముగానున్న యీసమయంలో నేనెవరినైనది జ్ఞాపకంవస్తున్నది. ఓహ్…ఓహ్!

డాక్టరుగారూ! మీరు భయపడకండి. నన్ను నాయిష్టము వచ్చినట్లు నవ్వనివ్వండి. మీరు భయపడి, విచారించి లాభంలేదు. ప్రపంచంలో ఏడాక్టరూ ఏమందూ ఏశక్తీ నన్ను రక్షించలేవు. మీరు ముందు దేనికి చికిత్స చేయాలో నిర్ణయించుకోలేనట్లు నాశరీరంమీద రెండు బలమైన కత్తిపోట్లు తగిలాయి. నన్ను బోర్లపడుకోబెట్టి వీపు

మీాదనున్న గాయానికి కుట్లుకుడదామనుకున్నారా! యీా లోపున పొట్టలోని గాయాన్నుండి పక్వాశయము, ప్రేవులు బయటకువచ్చి మరణిస్తాను. లేక నన్ను వెల్లకిలా పండుకోబెట్టి పొట్టమీాదిగాయానికి కుట్లుబెడదామనుకున్నారా? ఇంతలో వీపుమీాద గాయాన్నుండి రక్తమంతా కారి మీారు రెండు కుట్లుకుట్టేలోపల మరణిస్తాను. కనుక మీా ప్రయత్నాన్ని విరమించి నా కధ వినండి.

నేను క్రొత్తఢిల్లీ గవర్నమెంటు హాస్పిటలులో చాలా కాలం స్పృహలేకుండా పడివున్నమీాదట దాదాపు రెండు మాసములకింద టహటాత్తుగానాకొకరోజునస్పృహ తెలిసింది.

'నీ పేరు?' అని డాక్టరడిగాడు.

నే నెవరినో తెలుసుకుందామని, నా మెదడుకు చాలా పనిగల్పించాను. కాని నిష్ప్రయోజనం. నాకు గుప్తికిరా వడం... లేదు.

'హిందువ్వా? లేక ముస్లింవా?'

'అదిగూడా జ్ఞాపకంరావడంలేదు'

'నీ యిల్లు?'

'అదీ జ్ఞాపకంలేదు'

'నీకు తలిదండ్రిలు, బంధుమిత్రులు ఎవరైనా ఉన్నారా?'

'జ్ఞాపకంలేదు'

గతములో ఏమిజరిగిందో నాకేమీా గుప్తికిరావడము లేదు. నాఊరు, పేరు, తల్లి, తండ్రి, బంధుమిత్రులు, నాకేమీా జ్ఞాపకం రావడంలేదు. అంతా మరచిపోయాను. నాకు పెండ్లి

అయిందోలేదో, నావయస్సెంతో, నాకు పిల్లలున్నారోలేరో అదికూడా మరచిపోయాను. కాని నేనుయువకుడననిమాత్రం చెప్పగలను. కాని అద్దంలోచూస్తే నారూపు నాకే అసహ్యమేస్తుంది. నే నిదివరకెన్నడూ నాలో గనునించనటువంటి ముసలిరూపం, భయంకరంగా అద్దంలో కనిపిస్తుంది.

క్రొత్తఢిల్లీలోని డాక్టర్లందరూ నాస్మరణశక్తిని తిరిగి తెప్పించడానికై విశ్వప్రయత్నంచేశారు. కాని వృథా. వారు వారిప్రయత్నాలనుండి విరమించినతరువాత నేను నామెదడుకు పనిగల్పించి నేనెవరినో తెలిసికోవడానికై ప్రయత్నించాను. నేనెవరినో, నాపేరేదో, నాఊరేమిటో తెలిసికొనకుండా యీప్రపంచములో తిరగడమెలా? నావ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడ మెలా? ప్రయత్నంచేయగా చేయగా నేను పంజాబునుండి గాయాలుతగిలి హాస్పిటలుకు గొనిరాబడిన శరణార్థులతో ఢిల్లీ చేరానని తెలిసింది. చాలామంది హాస్పిటలులోనే మరణించారు. వీరంతా హిందువులా, ముస్లింలా, లేక సిఖ్ఖులా అని నేను హాస్పిటలు అధికారుల నడిగాను. అందరూ ఉన్నారని వారు జవాబుచెప్పారు. అసలు విషయమేమంటే అమృతసరం, లాహోరులనుండి శరణార్థులను ఎక్కించుకొని వస్తున్న రెండురైళ్ళు గూండాలచే పట్టాలు తప్పించబడి దాడిగూడా జరుపబడింది. అందులో ఒకటి పశ్చిమపంజాబునుండి హిందూ శరణార్థుల నెక్కించుకొని అమృతసరూ, రెండవది తూర్పుపంజాబునుండి ముస్లిము శరణార్థుల నెక్కించుకొని లాహోరు వెళ్ళుతున్నవి. రాత్రి దాదాపు పదకొండుగంటల సమయం.

బండి ఒక వంతెనమీదుగా పోతున్నది. ఇంతలో పెద్ద పేలుడుధ్వని వినిపించింది. ఇంజను ప్రక్కకు పడి పోయింది. కొన్ని పెట్టెలుగూడా నీరెండిపోయిన ఆవాగులో పడ్డాయి. చాలామంది మరణించారు. చాలామందికి గాయాలు తగిలినవి. బ్రతికి బయటపడినవారిలో కొంతమంది ప్రక్కనున్న అడివిలోనుండి వస్తున్న తుపాకిగుండ్ల కెరఅయి నారు. గాయాలు తగిలి కొంచెము లేవగలస్థితిలో నున్న వారు ప్రాణాలు గుప్పిటలోపెట్టుకొని దాగుకోడానికై పక్షుల్లా అడవిలోకి పారిపోసాగారు. ఒకగంట తరువాత అక్కడకు ఒకమైలు దూరంలో రెండవబండికికూడా ఇదే దుర్గతిపట్టింది. ఈ బండిలో గాయాలు తగిలినవారుగూడా ఆ ప్రక్కనున్న అరణ్యాన్నే శరణుజొచ్చారు. కొంతమంది దున్నిననేల కడ్డంపడి, ఎదురుదెబ్బలుతిని, పడుతూ లేస్తూ ప్రాణాలు గుప్పెటపట్టుకొని పరుగెత్తారు.

రెండవరోజు ప్రాతఃకాలాన్నే హిందూస్థాన్, పాకిస్థాన్ గస్తీదళాలు పెట్రోలుచేస్తూ తమతమ సరిహద్దులలో మరణించినవారిని,గాయాలుతగిలి పడివున్న వారినిచూశాయి. రక్తప్రవాహంలో మునిగి హిందువెవడో, ముస్లిమెవడో గుర్తించలేనట్లుగాపడివున్నా యా శవాలు. ఆదురదృష్టవంతులలో నేనొకడను. నన్ను అంబులెన్సులో హాస్పిటలుకు జేర్చిన వారికథనాన్నిబట్టి నేను స్పృహలేకుండా పడియున్నానట. నా గుడ్డలన్నీ రక్తంతో తడిసిముద్దయి వున్నాయట. నాతల హిందూస్థాన్‌లోనూ, కాళ్లు పాకిస్థాన్‌లోనూ వున్నవట. నా రక్తంతో సరిహద్దుగీత చెరిగిపోయిందిట. రక్తం...రక్తం...

రక్తం... హిందువుల...... మహమ్మదీయుల ...సిఖ్ఖుల రక్తం...విడదీయడానికి వీలులేనట్లుగా ఏకమై ప్రవహించి ఆ నేలను పంకిలంచేస్తున్నది.

ఓగడ్డం సాహేబుగారూ! మీరు నావంక యింతఆప్యాయంగా ఎందుకు చూస్తున్నారో నాకు తెలుసు. మరణించబోయేముందు అన్నిసంగతులు తెలుస్తాయట. నేనుముస్లిమునని చెబితే మీరు మీ ఖుద్దామ్-ఉల్-ముసల్మీన్ సంఘంతరఫున నన్నుమట్టిచేద్దా మనుకొంటున్నారుకదూ? ఓ తలగుడ్డ మహాశయా! మీరు చూచేదిగూడా ఎందుకో నా కవగతమైంది. నేను హిందువునని చెపితే మీరు మీ ధర్మసేవక సంఘంతరఫున నాకు దహనసంస్కారాది క్రియాకలాపాలు జరుపుదా మనుకొంటున్నారు. అంతేనా? బొంబాయిలో శవాలను పీక్కుతినే రాబందులున్నవని యిదివరకెప్పుడో విన్నాను. (బొంబాయిలో పార్శీలు శవాలను రాబందులకు వేస్తారు. దహనంగాని, ఖననంగాని చేయరు) ఇక్కడ యీ కొత్తఢిల్లీలో మనుష్యులు చావకముందే పీక్కుతినే నరరూప రాబందులున్నవని నాకు తెలియదు బాబూ!

అవును. మరచాను. నేను పాకిస్థాన్, హిందూస్థాన్ సరిహద్దువద్ద గాయపడ్డాను. నాకుతగిలినగాయ మాట్టే పెద్దది కాదు. అందుచే త్వరలోనే మానిపోయింది. నా మెదడుకి మంచి దెబ్బతగిలిందని, అందుచే స్మరణశక్తి కోలుపోయినానని డాక్టర్లు చెప్పారు. అందుచే నావెనుకటిగాథ నానుండి వేరుబడిపోయింది. అదేభూమి, అదే ఆకాశము, అదే గాలి, అదే వెలుతురు. అంతా యథారీతిగానే ఉన్నాయి. నాశరీ

రముగూడా అదే. కాని నేనుమాత్రం మారిపోయాను. నేనిప్పుడు పేరూ, ఊరూ లేని మనిషిని. నా ఫోటో హిందూస్థాన్ పాకిస్థాన్ పత్రికలలో ప్రకటింపబడింది. కాని నాభార్యా బిడ్డలుకానీ, నా బంధువులుగానీ, మిత్రులుగానీ, ఎవరూ దానిని గుర్తించలేదు.

బహుశా వారందరూ గూడా చంపబడేవుంటారనుకొంటాను. నేను ప్రపంచములో ఏకాకినై నిలిచాను. కొంత కాలము జరిగినతరువాత యిటువంటి సంఘటనే మరొకటి జరిగి గాయపడినవారిని యీ ఆస్పత్రికే తీసుకొనివచ్చారు. అందుచే డాక్టర్లు విధిలేక మమ్ములను విడుదలచేయవలసి వచ్చింది.

పంజాబునుండి వచ్చిన శరణార్థులతో ఢిల్లీ నగరంనిండిపోయింది. రోడ్లప్రక్కన, చెట్లక్రింద, ఎక్కడజూచినా శరణార్థులే. చిన్న చిన్న దుకాణాలు పెట్టుకొనీ, బండ్లు తోలుకొనీ జీవయాత్రసాగిస్తున్నారు.కనుచూపుమేరెచ్చటజూచినా పంజాబు స్త్రీ పురుషులే కన్పిస్తున్నారు. కొంతమంది భార్యాబిడ్డలతో వున్నారు. కొంతమంది బంధువులతో, కొంతమంది మిత్రులతో వున్నారు. అందరూ ఏదో ఒక ఆసరాతో నున్నారు. వారిని చూస్తే నాకు ఈర్ష్యకలిగింది. ఈప్రపంచములో ఏఆసరాలేనివాడను నేనే. నాకు భార్యలేదు, బిడ్డలు లేరు, బంధుమిత్రులులేరు. తుదకు పేరూ ఊరూ లేకుండా గూడా యీ విశాల ప్రపంచములో బ్రతికే దెలా? ఇలాంటి ఆలోచనలతో నగరమంతా తిరిగి తిరిగి జుమ్మామసీదువద్దకు వచ్చి చేరాను. జుమ్మామసీదుకు ఎదురుగానున్న ఉర్దూ

పార్కులో ఒక శరణార్థి శిబిరమున్నది. నేను దాని వద్దకు పోయి 'నేను శరణార్థిని. నన్ను రక్షించవలసినదని దాని వ్యవస్థాపకుని ప్రార్థించాడు.

'నీవు హిందువ్వా? లేక ముస్లింవా?' అని ఆయన ప్రశ్నించాను.

అబద్ధమాడడం నాకిష్టంలేదు. అందుచే 'నాకు గుర్తు లేద'ని జవాబిచ్చాను.

'అయితే మీదారిమీరు చూచుకోండి. ఇక్కడ మహమ్మదీయులకు మాత్రిమే'నని వ్యవస్థాపకుడు జవాబిచ్చాడు.

కాళ్ళీడ్చుకొంటూ నేను తిరిగికొత్తఢిల్లీ చేరుకున్నాను. ఇక్కడ యిందాకటి దానికంటెమరొక పెద్దశిబిరంకనిపించింది. నే నక్కడకుపోయి 'నేను శరణార్థిని. నాకు మీ శిబిరంలో చోటిప్పించవలసిన'దని ఒక స్వయంసేవకు నడిగాను. నాకు చాలారోజులనుండి తిండిలేనికారణంగా శుష్కించిపోయాను. గొంతుపిగిలి మాటరావడంలేదు. మెల్లగా అలానే మూగ సంజ్ఞగా మాట్లాడాను.

'అయితే నీవు హిందువ్వా? ముస్లింవా?'అన్నాడతను.

మరల అదేజవాబు—నాకు జ్ఞప్తిలేదని.

'పేరు?'

'అదీ జ్ఞాపకంలేదు. నాకేమీ గుప్తికి రావటంలేదు.

'అయితే ఎక్కడికైనాపోండి. ఈశిబిరం కేవలం హిందువులకు మాత్రమే.'

ఇలా కాళ్ళీడ్చుకొంటూ ఒక శిబిరాన్నుండి మరొక శిబిరానికి తిరిగాను. ఎక్కడకుపోయినా ఒక్కటే ప్రశ్న. ఒక్కటే జవాబు. ఇది హిందువుల శిబిరం. ఇది మహమ్మదీయుల శిబిరం. ఎక్కడజూచినా హిందూ, మహమ్మదీయ శిబిరాలే. ఇంత విశాలప్రపంచంలో జాతి, మతం, ఊరూ, పేరూ లేని మనుష్యులకెక్కడా శిబిరాలు లేవు.

ప్రాణం కడబట్టి ఆరాత్రి నేనొక బంగళాముందు పడిపోయాను. ఆబంగళా ఒక సిఖ్ఖు సరదారుది. ఆయనకు సెక్రటేరియట్‌లో యేదో ఉద్యోగం. ఆయన నన్ను సాదరముతో లోనకుతీసికొనిపోయి త్రాగటానికి పాలూ, తినడానికి కొన్ని పండ్లూ యిచ్చాడు. నేను కొంచెము తెప్పరిల్లుకొన్నాను. ఆయన నన్ను నీవు హిందువా? లేక ముస్లింవా అని ప్రశ్నించలేదు. 'అరేభాయీ! నీవు అలసిపోయినట్లున్నావు. కొంచెము విశ్రాంతి తీసుకో' మన్నాడు.

నేనాయనయింటిలో చాలారోజులున్నాను. సర్దారుజీగాని, ఆయనభార్యగానీ నన్నెంతో యిదిగా చూచేవారు. నేను నాకథ వున్నదున్నట్లు వారికి చెప్పాను. కాని వారు నన్ననుమానించలేదు. కొంతకాలమైనతరువాత వారిబంధువులెవరో రావల్పిండి నుండి సర్దార్‌జీయింటికి వచ్చారు. వారు రావల్పిండిలో ముస్లింగూండాలచే చాలా కష్టనష్టాలను పొందారట. వారిలో కొంతమందికి బలవంతంగా మహమ్మదీయమత మిప్పించారట. వారిబుర్రలు నున్నగాగొరిగారట. ఇండ్లు తగలబెట్టారట. వారికండ్లఎదుటనే స్త్రీలనుచెరచడం స్వయంగా చూచారట. ఇందుచే వారిహృదయాలన్నీ ఈర్ష్యా

క్రోధాలతో నిండిపోయాయి. వీరు చెప్పేమాటలు వింటే నాకుగూడ ముస్లిములంటే క్రోధం రాసాగింది.

సర్దార్ జీ నా కథ. వారికిగూడా వినిపించాడు. వారిలో కొంతమంది నేను జ్ఞాపకశక్తిని కోలుపోయినందుకు తమ సానుభూతిని తెలియజేశారు. కాని కొంతమంది నన్ను సందేహించకపోలేదు. 'వీడు దొంగముండాకొడుకుకావచ్చు. వీడెవడో తప్పకుండా మహమ్మదీయుడై వుంటాడు. ఆదమరచి వున్నామా వీడు తప్పకుండా మనకొంపతీస్తాడు' అని ఆరాత్రి వారిలో ఒక రనడం నాచెవులారా విన్నాను. ఆమాటలంటున్నప్పుడు అతనికన్నులా చీకట్లోగూడా చింతనిప్పుల్లా మెరవడం చూచాను.

ఆమాటలు విన్నతరువాత నన్నుగూడా అదేసందేహం బాధించసాగింది. నాస్మరణశక్తి పోకపూర్వం నేనుగూడా ముస్లిమునేమో? ఎవరికి తెలుసు? నేనూ అలానే ఎన్నో దుష్కృత్యాలు చేస్తేనే నాకు భగవంతుడిలాంటి దుర్గతి పట్టించాడేమో? ఆరాత్రి గంపెడుచీకటి నెత్తినవేసుకొని సర్దార్ జీ యింటిలోనుండి పారిపోయాను.

తిరిగి నేనెక్కడకుపోయినా, ఆకలిదప్పులు, అవే ప్రశ్నలు ఎదుర్కోసాగాయి. ఈ శిబిరం హిందువులకు మాత్రమే. ఈ శిబిరం మహమ్మదీయులకు మాత్రమే. 'నీవెవరు?' నీపేరేమిటి? నీకులమేమిటి? నీగోత్రమేమిటి? నీవెక్కడనుండివచ్చావ్?' ఎక్కడకుపోయినా ఇవేప్రశ్నలు. వీటన్నిటికీ ఒక్కటేజవాబు— నాకు జ్ఞాపకంలేదని. కారణం, నేను మెదడులేని మనిషిని.

ఇంత మహాపట్టణంలో నేను తలదాచుకోడానికి గూడా చోటుదొరకలేదు. తిరిగితిరిగి కాళ్ళలోని సత్తువకూడ తగ్గిపోయింది. తిరిగి జుమ్మామసీదువద్దకుజేరి ఆ మెట్లమీద మేనువాల్చాను. ఈ వెధవబ్రతుకు బ్రతికేకంటే చావు మేలనుకొన్నాను. అలసివున్నాను గాబట్టి వెంటనే కన్నంటింది. నేను కండ్లుతెరచి చూచేసరికి ఎనిమిది సంవత్సరముల కుఱ్ఱవాడొకడు నాఎదుట నిలిచియున్నాడు.'లే. లేచికూర్చో, మాఅమ్మ నీకొరకు భోజనం పంపించింది. లేచి తిను' అంటున్నాడు. ఒకవేళ ఆభోజనములోని ఆకర్షణే నేను లేచికూర్చోడానికి శక్తినిచ్చిందనుకొంటాను. నేను చాలా రోజులనుండి తిండిలేని కారణంగా ఆ కుఱ్ఱవాడు తెచ్చినరొట్టెలన్నీ ఎంతో అపూర్వంగాతిని 'భగవంతుడు నీకు చిరాయురారోగ్యములు ప్రసాదించుగాక' అంటూ అతని చేతులు పట్టుకొన్నాను. అతను ఉలిక్కిపడి 'నీశరీరం మండిపోతున్నది. నీకు జ్వరం తగిలినట్లున్నది. నా వెంట రా. మానాన్న వైద్యుడు. ఆయనగారితో చెప్పి నీకు మంచి మందిప్పిస్తాను. నీకు భగవంతుని దయవలన త్వరలోనే నయమౌతుంది.' అంటూ చేయి పట్టుకొని నన్ను తనయింటికి తీసికొనిపోయినాడు.

హకీంసాహెబు మంచిభక్తుడు, వైద్యుడు. బీదసాదలకు ఉచితంగానే మందిస్తాడు. ఆయనగారికి హిందూ ముస్లిం అనే భేదంలేదు. రోజూఅయిదారుసార్లునమాజుచేస్తాడు. నన్నుచూచి ఏదో యూనాని మందిచ్చాడు. తాగడానికై మూడు సార్లు పాలిచ్చేవారు ప్రతిరోజూ. హకీంసాహెబుగారి చేతి చలువవలన కొద్ది రోజులలోనే నా జ్వరం తగ్గిపోయింది

కాని అటువంటి వైద్యునివద్దకూడా నా స్మరణశక్తికి మందు లేకపోయింది. ఆయనగారితో ఒకనాడు నాస్మరణశక్తి పోక ముందు నేను హిందువునేమో? అలాగయితే మీయిల్లు వదలి... అన్నాను. ఆయనగారు నాభుజంతట్టి 'నీవు హిందు వయినా, సిఖ్ఖువయినా ఏమీ ఫరవాలేదు. మనమంతా మానవుల' మన్నాడు.

కొన్నాళ్ళకు నేనాయింటిలోకూడా వుండజాలనటు వంటి ఘోరసంఘటన ఒకటి జరిగింది. ఒకనాడు హాకీం సాహెబుకుమారుడు మామూలుగా నాలాంటి ఆకలిగొన్న అభాగ్యులకొరకై రొట్టెలు తీసికొని బయటకువెళ్ళాడు. చాలా సేపటివరకు తిరిగిరాలేదు. హాకీంసాహెబ్ నేనూకలిసి చాలాదూరం వెదికాము. కాని లాభంలేదు. జుమ్మామసీదు వద్దనుండి తిరిగివస్తుంటే దరీబావద్ద ఎవరో హిందువు లతనిని పొడిచివేశారనే విషాదకరమైనవార్త రాత్రికి తెలిసింది. ఇంట్లో అందరూ దుఃఖసాగరంలో మునిగిపోయారు. నాకుగూడా దుఃఖం పొర్లుకువచ్చింది. రాత్రింబవళ్ళు ఆ కుర్రవానిరూపం నాకన్నులలో మెదలసాగింది. 'జ్ఞాపకమున్నదా! చచ్చిపోబో తున్న నీకు నేను ఆహారంపెట్టి రక్షించాను. అలాంటినన్ను నీవుచంపావు' అని ఆ కుర్రవాడంటున్నట్లు నాచెవుల్లో ప్రతి ధ్వనించసాగింది. ఆ కుర్రవాడిని నేను చంపలేదు. ఎందుకో నాకలాంటిభావ ముత్పన్నమైనది. ఏమో ఎవరు చెప్పగలరు, నాస్మరణశక్తి పోకపూర్వము నేను హిందువునేమో! హాకీం సాహెబుకుమారునిలాంటి పసిబిడ్డల నెందరిని నా కరకుకత్తికి

బలియిచ్చానో? ఒకనాటి తెల్లవారుజామున ఎవరితోనూ చెప్పకుండా ఆ యింటిలోనుండి పారిపోయాను.

ఆరోజు డిల్లీలో గలాటాలు ప్రారంభమైనాయి. ఎక్కడజూచినా దోపిడీలు, హత్యలు, గృహదహనాలు, కత్తిపోట్లు సర్వసాధారణమైపోయాయి. మానవులు మానవత్వాన్ని కోల్పోయి నడిబజారులలో ఒకరిమీదఒకరు గుండ్ల వర్షాన్ని కురిపించుకొంటున్నారు. ఇక నాబోటివాని కక్కడుండడం అసంభవమనిపించింది. బొంబాయిలో ప్రశాంతంగా వున్నదని మెల్లగా సందుగొందులగుండా స్టేషనుకుచేరాను. నేను ప్లాట్‌ఫారంమీద కాలుపెట్టగానే ఫ్రాంటియర్ మెయిలు బయలుదేరడానికి సిద్ధముగానున్నది. నేను మెల్లగాబండి లోపడ్డాను. బండిలోచాలావత్తిడిగానున్నది. నాప్రక్కనే ఒక పంజాబీయువకుడు కూర్చునియున్నాడు. అతని ముఖంమీద విషాదరేఖ లలముకొనివున్నాయి. బండి బయలుదేరగానే 'భాయీ! ఎవరునీవు?' అని ప్రశ్నించాడు.

మామూలుగా నేను హిందువునో, ముస్లిమునో జ్ఞాపకంలేదని చెప్పాను.

'నీగడ్డం చూచి అనుమానించి అడుగుతునాను. ఈ బండిలో ముస్లిములు ప్రయాణంచేయడం ప్రమాదం' అన్నాడు.

నేను నాకథంతా అతనికి వినిపించాను. అతను అనుమానంగా నాగడ్డంవంకే చూస్తున్నాడు. అతనికి నామాటలయందు విశ్వాసం కలుగలేదని గ్రహించాను. మాటల సందర్భములో అతను లాహోరులో తనయిల్లు దోచుకొని తగల

బెట్టబడిందనీ, అతని బంధుమిత్రుల నందరినీ దుండగీండ్రు చంపారనీ, ఇప్పుడు పొట్టచేతబట్టుకొని బొంబాయి పోతున్నానని చెప్పాడు.

గూండాలచే బండి భరత్ పూర్ వద్ద ఆపివేయబడింది. ముస్లిములని అనుమానం తగిలినవారినందరినీ బయటకులాగి కత్తికి బలి యిస్తున్నారు.

ఆసంఘటన తలుచుకుంటే నాకిప్పటికీనవ్వొస్తున్నది. అలాంటి ఘోరసంఘటన తలుచుకుంటే నవ్వెందుకు వస్తుందంటారా? చెపుతా వినండి. 'ఆ హత్యలు, దోపిడీలు చేస్తున్నంతసేపూ ఆగూండాలు 'మహాత్మాగాంధీకి జై, జవహర్ లాల్ నెహ్రూకి జై' అని అరుస్తూనే ఉన్నారు. ఈసంగతి వింటేచావటానికి సిద్ధముగానున్నవాడికిగూడా నవ్వొస్తుంది

కొంతమంది గుండాలు మాపెట్టెలోకి ఎక్కారు. నేను మరణించడానికి సిద్ధమౌతున్నాను. నేను ముస్లిమునేమో నాకు తెలియదు. కాని నాకు గడ్డమున్నదనిమాత్రం తెలుసు. నాప్రాణాలు తీయడాని కది చాలు. ఇంతలో నా ప్రక్కనున్న పంజాబీయువకుడు పెద్దదుప్పటొకటి నామీద ఆపాదమస్తకం కప్పి 'ఇతడు నాతమ్ముడు, అనుమానించకండి. మేము లాహోరునుండి వస్తున్నాము. ఇతనికి రెండు రోజులనుండి జ్వరము వస్తున్నది. మాట్లాడలేనిస్థితిలో వున్నా'డంటూ వారితో చెప్పాడు. వా రాయువకునిమాటలు విశ్వసించి వెళ్ళిపోయారు. బయట గుండ్లవర్ష మింకా కురుస్తూనే ఉన్నది. బండి బయలుదేరింది.

నేను బొంబాయి చేరాను కాని, యిక్కడగూడా అవేప్రశ్నలు నన్ను వెన్నంటాయి. నీవు హిందువ్వా? ముస్లిమువా? సిఖ్ఖువా?

హిందువెవడు? ముస్లిమెవడు? నేను ముస్లిమునని అనుమానించిగూడా రైలులో నాప్రాణాలుకాపాడిన పంజాబీ యువకుడు హిందువా! దయాదాక్షిణ్యాలు, మానవత్వం లేకుండా దరీబాలో పసిబిడ్డహకీంసాహెబుకుమారునిరక్తంతో తనహస్తాలను కలుషితం చేసుకొన్న దుర్మార్గుడు హిందువా? మహమ్మదీయు డెవరు? హకీంసాహెబు, అతనివంశమా? లేక రావల్పిండిలో సిఖ్ఖులగృహాలను, స్త్రీలను, ధనాన్ని, తుదకు సర్వస్వాన్ని దోచుకొన్నగూండాలా? సిఖ్ఖువడు? సర్దార్ సాహెబా? లేక ఢిల్లీలో కల్లోలాలు రేపిన గూండాలా?

ముస్లిమెవడు? హిందువెవడు? సిఖ్ఖువడు? ఈ ప్రశ్నకు జవాబుదొరకలేదు. దొరకదు. ఈప్రశ్నలు మనశరీరములోని ప్రతిఅణువులోనూ జీర్ణించిపోయి స్థిరనివాసమేర్పరచుకొన్నాయి. నీవువరు? హిందువువా? లేక ముస్లింవా? ముస్లింవా? హిందువ్వా?

నేనెవరిని? హిందువునా? ముస్లిమునా? ఈ ప్రశ్న రాత్రింబవళ్ళు నన్ను వెన్నంటుతూనే ఉన్నది. నేను పండు కొని కండ్లుమూసుకొందామనుకొన్నా ఎర్రని నిప్పుగోళాల్లాంటి కన్నులతో ఏవోభూతాలు నన్ను పరివేష్టించి, 'నీవు ఎవరు? హిందువువా? ముస్లింవా? ముస్లిమువా? హిందువ్వా? అని ప్రశ్నించినట్లుంటుంది.

నన్నిలా ఒంటరిగా బ్రతకనివ్వండి. నేను హిందువునో ముస్లిమునో నాకు తెలియదు! నేను హిందువునికాను. ముస్లిమునికాను, సిఖ్ఖునికాను, నే నెవరినీగాను. కేవలం మనుష్యుడను.

బొంబాయిలోగూడా శరణార్థిశిబిరాలున్నాయి. నీవు సిఖ్ఖువయితే తిన్నగా ఖాల్‌సా కాలేజివద్దకువెళ్ళు. నీవు హిందువువయితే రామకృష్ణ ఆశ్రమమువద్దకు వెళ్ళు. నీవు ముస్లిమువయితే అంజుమన్ ఇస్లామియా హైస్కూలువద్దకు పోతే రక్షణ దొరుకుతుంది. కాని నే నెక్కడకువెళ్ళేది? నేనెవరినో నాకే తెలియదు. ఎక్కడకని వెళ్ళను? నాకు నవ్వొవస్తున్నది.

అడుక్కుతినడానికికూడా ఆస్కారంలేదు. బిచ్చంపెట్టబోయేముందు ప్రతివారూ నీవు హిందువ్వా?ముస్లింవా? అని ప్రశ్నిస్తారు. అయితే నేను రత్నగర్భమైన భారతభూమిలో ఆకలిబాధతో అలమటించి మరణించవలసిందేనా? లేదు. అలా ఎన్నటికీ జరగగూడదు. ఏవిధంగానైనా నే నెవరినో తెలిసికోవాలి. నేనెవరినో తెలిసికోకుండా జీవించడానికి అవకాశంలేదు.

డాక్టరు సమూనీవద్దకుపోతే నాజబ్బు నయంచేస్తాడని ఎవరో సలహాచెప్పారు. డాక్టరు సమూనీనిగురించి మీరంతా వినేఉంటారు. అతనొక సైకాలజిష్టు. అతను రోగులకు మందివ్వడు. సైకలాజికల్‌గా అతనిమనస్సును మార్చడానికై ప్రయత్నిస్తాడు.

గదిలో నిశ్శబ్దత తాండవిస్తోంది. గోడలకు బాగా వెల్ల వేసివున్నది. డాక్టరుగారికోటు, నన్నుగౌనుకూడా తెల్లగానే ఉన్నాయి. గదిలోనున్న అన్నివస్తువులూ తెల్లగానేఉన్నాయి. అన్నీ నయనానందకరంగా అమర్చబడి ఉన్నాయి. అన్నిటినీ మించింది డాక్టరుగారి మృదుమధురమైన కంఠధ్వని.

'నీవేమీ భయపడవద్దు. నీవు మాట్లాడ దలచినది నీ యిష్టము వచ్చినట్టు మాట్లాడు. అశ్లీలాలని జంకబోకు. నీవు చెప్పదలచినది నిర్భయంగా చెప్పు' అంటూ డాక్టరు నేను చెప్పేవిషయాలను వ్రాసుకోడానికై కలమూ, కాగితమూ తీసుకొన్నాడు. నేను కండ్లుమూసికొని ఆలోచించ సాగాను.

'నీలాకాశము' నేను చెప్పడం మొదలెట్టాను—'పగటి దృశ్యాలు, భావాలే రాత్రి కలగా వచ్చేది. నీలాకాశము... పచ్చని బీళ్ళు... పండబారిన పొలాలు...

సెహబాస్, సెహబాస్, అంటూ డాక్టరు కాగితం మీద బరబరగీసే ధ్వనివిన్నాను. 'ఆఁకానివ్వు, ... పండబారిన పొలాలు. తరువాత' అన్నాడు.

నీలాకాశము... బీళ్లు... పండబారిన పొలం... చిన్న చిన్న కాలువలు... కాలువలలో చిన్నచిన్న పడవలు. ఒక కాలవలో పిల్లలు యీతగొడుతూ ఒకరిమీద ఒకరు నీళ్ళు చిమ్ముకొంటున్నారు. అరె. పాపం ఒకపిల్లవాణ్ణి దొంగనుజేసి అంతా అతనిమీద నీళ్లు చిమ్ముతున్నారు.

'ఆఁ ఆఁ ఆగు. ఆపిల్లలెవరు? హిందువుల పిల్లలా? ముస్లిముల పిల్లలా?!' అన్నాడు డాక్టర్.

'కేవలం పిల్లలు,'

'మంచిది. చెప్పు. చెప్పు.'

'పండబారిన పొలాన్ని కోస్తున్నారు. కోతకోస్తూ ఎంత చక్కని పాటలు పాడుతున్నారో వినండి.'

'ఎవ రా పాడేది'

'స్త్రీలు'

'స్త్రీలే. హిందూ స్త్రీలా? ముస్లిం స్త్రీలా?'

'పంజాబుస్త్రీలు, హిందువులు, ముస్లిములు, సిఖ్ఖులు'

నేను డాక్టరుగారి నిరాశాపూరిత వదనాన్ని గమనించాను'

'సరే. చెప్పు, చెప్పు.'

'నాకిప్పుడేమీ కనిపించడములేదు. వినిపించటము లేదు.'

'కారణం?'

'నాతల బద్దలై పోతున్నది. నలుగడలా అంధకారం... ఏదో భయంకరమైన ధ్వని.'

'ప్రియత్నించిచూడు. నీకిప్పుడేమీ కనిపించడము లేదా?'

'ఆఁ. కనిపిస్తున్నవి. మంటలు ఆకాశానికంటుతున్నవి. ఊరంతా తగలబడిపోతున్నది. హాహాకారాలు. స్త్రీలు విహ్వాలచిత్తులై ...'

'అవును. అక్కడ దాడి జరుగుతున్నది. అదిగో వారే, నీయిల్లుతగులబెట్టి, నీబంధుమిత్రులనుచంపి, నిన్నీస్థితికి తీసుకొని వచ్చింది. చక్కగా విను వారేమంటున్నారో.'

'నాకేమీ కనిపించడములేదు. అంతా గోల. చంపు చంపు, అనే ఒక్కమాటే వినిపిస్తున్నది. నన్నురక్షించు, నన్ను రక్షించు డాక్టర్.'

'ఇప్పుడే జాగ్రతగా వినవలసినది. జాగ్రత్తగా విను. జ్ఞాపకముచేసుకోవడానికై ప్రయత్నించు. వారే నీయిల్లు తగలబెట్టి, నీబంధుమిత్రులను చంపింది. అందుకు ప్రతీకారం చేయాలి, ప్రతీకారం.'

'ఆఁఆఁ. డాక్టర్ నాకిప్పుడిప్పుడే గుప్తికివస్తున్నది. నేను హిందువునో, ముస్లిమునో యిప్పుడిప్పుడే జ్ఞప్తికి వస్తున్నది... నేను మహమ్మదీయుడను. లాహోర్‌లో సర్దార్ సాహేబుబంధువులనుచంపి వారియిండ్లు దోచుకొన్నది నేనే. రైలులో నాప్రాణాలు రక్షించిన పంజాబుయువకుని దుకాణాన్ని లాటీచేసింది నేనే. నేనే అనేకమంది హిందువుల, సిక్కులరక్తాన్ని కండ్లజూచాను. నేను హిందువుని. కండ్లు తెరవనిపసిబిడ్డహకీంసాహేబుకుమారునిపొట్టలోకత్తిదింపిందినేనే.'

'ఆకలితో అలమటిస్తున్న నా కతను రొట్టెలుబెట్టి ప్రాణాన్ని నిలిపాడు. అందుకు కృతజ్ఞతాసూచకంగా నేను నాకత్తి కతనిని బలియిచ్చాను. నేను అనేకమంది ముస్లిము స్త్రీలను, పురుషులను పిల్లలను చంపాను. లేదు లేదు, నేనెవరినీగాదు. నేనెవరినో తెలుసుకోవాలనే ప్రయత్నంగూడా చేయను. నేను హిందువును కావాలనుకోవడంలేదు. ముస్లిమును కావాలనుకోవడంలేదు. సిక్కును కావాలనుకోవడం లేదు.' అంటూ అక్కడనుండి మెల్లగా జారుకొన్నాను.

'నేను హిందువుని ... నేను మహమ్మదీయుడను...

నేను మహమ్మదీయుడను... నేను హిందువును... నేను హిందువును. నేను మహమ్మదీయుడను... నే నెవరిని? నేనెవరినీగాను... నేనెవరినీగాను, నేను హిందువుని... నేను మహమ్మదీయుడనంటూ ప్లేగురోగాన్నిచూచి భయపడి పారిపోయే వానిలా బజారులవెంట పరుగెత్తుతున్నా. నేను హిందువుని.. ముస్లిముని... అనేప్రతిధ్వని నన్నువెన్నంటివస్తూనేయున్నది.

నే నేయేచోటులు తిరిగానో నాకు తెలియదు. ఒక గొందిదగ్గరకు వెళ్ళేసరికి ఒకమనిషి నాకు అడ్డంవచ్చి 'అరె సాలా! ఎవరునీవు? ఎక్కడికిపోతావ్?' అన్నాడు.

'అది ముస్లిముప్రశ్నలాగున్నది. అతనికన్నులలో ఎర్రదనాన్ని, అతనిచేతిలో గుప్తంగాదాచబడినకత్తినీ గమనించాను. నేను నా మామూలు ధోరణిలో 'నేను హిందువుని... నేను—ముస్లి—'

ముస్లిముని అనేమాట పూర్తికాకముందే అతనికత్తి నావీపులోనుండి దూసుకుపోయింది. నావీపుమీద మీకిప్పుడు కనిపించే గాయ మదే.'

'చావు. కాఫర్' అంటూ అతను వెళ్ళిపోయాడు. నా కండ్లు తిరుగుతున్నాయి. క్రిందపడబోయి ఎలానో నిలద్రొక్కుకున్నాను. నేనుచచ్చిపోతే బావుండేది కాని, చావలేదు. మెల్లగాకాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాను.నాశరీరము నుండి కారేరక్తం చారగా నావెంటవస్తున్నది.మీరునమ్మరు. నమ్మకపోతే నాకేమీ విచారంలేదు, మరణించనున్న నేను మీతో అబద్ధమాడవలసిన అవసరంలేదు.'

'నేను పడుతూ, లేస్తూ అలాగే యీ దేహాన్ని

యీడ్చుకుపోతున్నాను. అలానే నేను మరొక సందు వద్దకు చేరుకున్నాను. ఇక్కడ నాకొక హిందూగూండా ఎదురై 'ఏయ్! ఎవరునీవు? ఎక్కడికి పోతావ్' అంటూ తనచొక్కా లోనుండి రక్తదాహంగొనియున్న కత్తిని బయటకు తీశాడు'

'నేను పాతపాట మొదలెట్టాను. నేను మహమ్మదీయుడను. నేను హిందు...' హింధువుని అనేమాట పూర్తిగాకముందే అతనికత్తి నా పొట్టలో గుచ్చుకొన్నది.

'ఈ రెండుగాయాలు ఎందుకు తగిలినవో యిప్పుడర్థమైనదా మీకు? ఒకగాయం హిందువులది. రెండవది మహమ్మదీయులది. ఇందుచే, డాక్టరుగారూ! మీరు నన్ను బ్రతికించలేరు. మీరేకాదు. ప్రపంచంలోనున్న ఏడాక్టరూ, ఏశక్తీ, ఏమందూ నన్ను బ్రతికించలేవు. ఇకపోతే మీరింత ఏకాగ్రచిత్తంతో నావైపు ఎందుకు చూస్తున్నారో నాకుతెలుసు. నేను చావబోయేముందు హిందువునని చెపితే యీ నగరంలోనున్న హిందువులంతా అమాయకులైన ముస్లిముల నందరనూ ఊచకోతకోద్దామని లేక నేను ముస్లిముని చెపితే ముస్లిములందరూ ఏకమై నిరపరాధులైన హిందువుల కుత్తుకలుత్తరిద్దామని. అంతేనా?'

'నాకు నవ్వు వస్తున్నది. నాకిప్పుడు గుప్తికివచ్చింది. చావబోయేవాడికి భూతభవిష్యద్వర్తమానాలు తెలుస్తవట. నాస్మరణశక్తి తిరిగివచ్చింది. నేనెవరినో నేనిప్పుడు తెలిసికొన్నాను. నాకిప్పుడు నాకన్నులముందే చంపబడిన నా భార్యా బిడ్డలు, నాకనులముందే దోచుకోని తగలబెట్టబడిన నాయిల్లు కనిపిస్తున్నాయి. నా మెదడుకు దెబ్బతగిలి

నేను మరచిపోయిన దృశ్యాలన్నీ నాకిప్పుడు స్పష్టంగా కని పిస్తున్నాయి. నాపేరు, నాబంధుమిత్రులు, నాఊరూ, పేరూ, నామతం, నాజాతి అన్నీ గుప్తికివచ్చాయి. చావ బోయేవాడికి అన్నీ తెలుస్తాయి.

'కాని, ఓ నాప్రియమైనసోదరులారా! మీరు వృథాగా నిరీక్షిస్తున్నారు. నేనెవరినైనది ఎంతమాత్రం చెప్పను. ముమ్మాటికి చెప్పను. పొడిచినవాడు 'అరె! నేను పొరపాటు పడలేదుకదా. పొరపాటున మనవాడినే పొడిచానేమో!' అని కుళ్లికుళ్ళిచావాలి. అతనొక్కడేకాదు. హిందువులు, ముస్లి ములు, సిఖ్ఖులు, అంతా 'మనం పొరపాటు పడలేదుగదా' అన్న జిజ్ఞాసలో, తరతరాలు అశాంతితో దుఃఖంతో కుళ్ళి చావాలి. ఇదే నా ప్రతీకారం.'

'నేను హిందువునా? ముస్లింనా? ముస్లింనా? హిందు వునా? ఈప్రశ్న రాత్రింబవళ్ళు వారిని వేధించాలి. పట్టణా లలో, పల్లెలలో, కార్ఖానాలలో, మిషనుల రణగొణధ్వనిలో ట్రాముల్లో, బస్సుల్లో, రైళ్ళలో, కచ్చేరీలలో, బండ్లచక్ర ములధ్వనిలో, ఫాక్టరీపొగలో ఎక్కడజూచినా ఇదేప్రశ్న వారి నెదుర్కొనాలి.

నేను హిందువునో ముస్లిమునో, మీ పిల్ల పిల్లతరాలకు తెలియగూడదు. మనం పొరపాటుపడలేదుగదా? అనే జిజ్ఞా సతో, దుఃఖంతో, అశాంతితో తరతరాలు కుళ్ళిచావాలి. ఇదే నా ప్రతీకారం.'

'ఏం డాక్టర్! నేనెందుకు నవ్వుతున్నానో యిప్పటి కైనా అర్థమైందా? నన్ను నవ్వుతూ మరణించనివ్వండి.

(12)

# పహారా హుషార్

అర్ధరాత్రిసమయం. తాలూకా ఆఫీసులో కోర్టుగం టలు ఒకటి, రెండు, నాలుగు-పది-పండ్రెండంటూ ఆవలి స్తూనే లెక్కపెట్టాడు సేట్ గోవిందలాల్. తన దుకాణాని కున్న ఇనుప కవాటాన్ని తన చేతులతోనే బంధించాడు. తన చేతిమీదుగా తాళంవేశాడు. తాళాన్ని మూడు నాల్గు సార్లు లాగి లాగి, ఊపి ఊపి చూచి తాళమువేయడంలో పొరపాటులేదని నిశ్చయించుకొని ముందున్న ప్రహరీగోడ వంక చూచాడు. నాలుగుగజాలగోడ, గోడ పైభాగంలో సీసపుపెంకులు సిమెంటుతో బిగించబడివున్నాయి. దొంగలు గోడదూకి యింట్లోప్రవేశించడానికి సాధ్యంకాదనినిర్ణయించు కొన్నాడు. ఇంతలో ఒకచేతిలో బాటరీలైటు, రెండోచేతిలో పొడుగాటి సన్నని లాటీతో ఘూర్ఖావాలా జగ్గూ అక్కడకు వచ్చాడు. 'ఏం జగ్గూ. ఏం పరవాలేదుగదా' అన్నాడుసేట్. ఈ జగ్గూ బొందిలో ప్రాణముండగా ఏమీ భయపడవలసిన పనిలేదు· నిశ్చింతగానిదురపోండన్నాడు. ప్రతిదినమూ రాత్రి పండ్రెండుగంటలవేళ సేట్ అలా అడగడమూ, జగ్గూ అలా సమాధానం చెప్పడమూ మామూలు. సేట్ ఒక పర్యా

యమలా జగ్గూని ఎగాదిగా చూచాడు. ఆరడుగులపై చిలుకు మనిషి. మలచినట్లున్న కండరాలు, గుండ్రనిముఖం, దుబ్బు లాంటి మీసాలు, చిన్నచిన్న కండ్లు, ఆ కండ్లలో గంజాయి గుడ్డినిషాయొక్క ఎర్రదనం. వీటన్నిటినీమించి ఆ చివరనూ యీచివరనూ రెండేసి అంగుళాల యిత్తడిపొన్నులువేసి, నిత్యమూ నూనెతో మర్దనచేసే జగ్గూచేతిలోని లాటీనిచూచి ఏదొంగకుతనయింటివైపుకన్నెత్తిచూడడానికి గుండెలుంటా యనుకున్నాడు సేట్.

కాని యింట్లోఅడుగుపెట్టగానే ప్రతిరోజు ఒకసందేహ మతన్ని భాధిస్తూనేఉంటుంది. 'ఒకవేళ జగ్గూయే దొంగతనా నికి తలపడితే' అని. జగ్గూ పహరాయివ్వడానికి వెలుపలబెట్టి లోపల తాళంవేశాను. నాలుగుగజాల గోడను, సీసపుపెంకు లను, ఇనుపకటకటాల్ని, గాడ్రేజి తాళాల్ని తప్పించుకొని జగ్గూ లోపలప్రవేశించడం కలలోనిమాట అని తనకుతానే సమాధానము చెప్పుకొనేవాడు. కాని క్రిందిభాగంలో అద్దె కున్నవారితోనే వచ్చిపడింది—పీకులాటంతా. ఇల్లుఖాళీచేయ మంటే చేయడు. రాత్రిపూట యిల్లువదలి బయటకు పోడు. ఇతనేదో దురుద్దేశంతోనే యిల్లువదలిపోడని సేట్‌కి అనుమా నం. ఏదురుద్దేశం లేకుంటే కోర్టుతో పనిలేకుండా వెయ్యి రూపాయలిస్తానన్నాగూడా యిల్లు ఖాళీ ఎందుకుచేయడు? ఏదో మొదట్లో అద్దెడబ్బుల కాసపడి గడ్డితిన్నాడు. ఇప్పు డతనిని వదలించుకోటానికి తాతలుదిగివస్తున్నారు. ఇల్లంతా తనక్రిందేవుంటే ఏవిచారంలేకుండావుండేది. ఒకవేళ కోర్టుకు పోదామన్నా ఈ వెధవ అద్దెకంట్రోలుబిల్లొకటి దాపురిం

చింది. కోర్టుగూడా వాళ్ళపక్షానే తీర్పుయిస్తుంది. సేట్ లోపలకువస్తూ బయటకుపోతూ వాకిటిముందు వేల్లాడుతున్న 'కుందన్‌లాల్, జర్నలిస్టు' అనే బోర్డుచూచి కుందన్‌లాల్‌నీ, కోర్టునీ, న్యాయాధికారుల్నీ, అద్దెకంట్రోలుబిల్లునీ లోలోపల తిట్టుకొనేవాడు. యీ వెధవప్రభుత్వం వచ్చి అద్దెకున్నవాళ్ల నెత్తికి కండ్లు తెచ్చింది.

సేట్‌కి కుందన్‌లాల్ జర్నలిష్టనేదిగూడా సందేహామే. ఎందుచేతనంటే అత నేఆఫీసులోనూ పనిచేసినట్లు కనిపించడు. ఎప్పుడూ ఇంట్లో కూర్చుని టైపురైటరుమీద టక్కు-టక్కు-మని కొడుతూవుంటాడు— ఇల్లు వదలకుండా వుండడానికి ఇదొక దొంగెత్తు. ఇతని కేదో దొంగలముఠాతో సంబంధ ముండి వుంటుంది. సమయం దొరికితే యింట్లో జొరబడరని యెవరు హామీ యిస్తారు. ఒకవేళ యితడు నిజంగా జర్నలిస్టేఅయినా సేటు దృష్టిలో జర్నలిష్టూ, దొంగా ఒకటే. ఏమంటే యిరువురూ బ్లాక్‌మార్కెట్‌దార్లకూ, భోగలాలసులకూ, భాగ్యవంతులకూ శత్రువులు. ప్రపంచంలోవున్న పత్రికలన్నీ బ్లాకుమార్కెటుదార్లను దుమ్మెత్తిపోసేవే. నేను బ్లాకుమార్కెటులో రెండుకోట్లరూపాయలు సంపాదించానని యీ దౌర్భాగ్యుడికి తెలుసు—ఆవిషయాన్ని ఏపత్రికలోనైనా ప్రకటించాడా సర్కారువారు ఇన్‌కంటాక్సు తగిలించడమే గాకుండా పైగా కేసుబనాయిస్తారు. నేను కాంగ్రెసుకి అయిదువేలరూపాయలు చందా యిచ్చానంటేమాత్రమెవడు నమ్ముతాడు. ఈరోజుల్లో వెధవ కమ్యూనిస్టుల, సోషలిస్టుల మాటలునమ్మి మనవాళ్ళనుకొన్న మంత్రులుగూడా ఇనుప

పెట్టెలమీదకు దాడి బయలుదేరుతున్నారు. అదీగాక యీ కుందనలాల్ జర్నలిస్టువద్దకు రోజూ చాలామంది వస్తూపోతూ ఉంటారు. కొంతమంది ఖద్దరుగట్టుకొని, కొంతమంది మురికి గుడ్డల్తో, కొంతమంది గడ్డాలు, మీసాలతో వస్తుంటారు. వీళ్ళంతా గూండాలు కాకపోయినా కనీసం కమ్యూనిష్టు లయినా అయివుంటారని సేట్‌కి అనుమానం. ఇందులోకొంత మంది రాత్రింతా కుందనలాల్‌తో యిక్కడే గడుపుతారు. చీట్లాడుతూ టీ త్రాగుతూ, కబుర్లు చెప్పుకుంటూ, పాటలు పాడుకుంటూ, కేరింతలుకొడుతూ తెల్లవార్లూ కాలంగడుపు తారు. ఒకనాడు వీళ్ళేమి మాట్లాడుకొంటున్నారా అని చెవి తలుపుకు ఆనించాడు సేట్. 'ఓ చెరుకా! రస మిమ్మంటే, యిస్తుందటరా! గానుగలోపెట్టి త్రిప్పితే అప్పు డిస్తుంది. అలాగే యీ సేట్లను పొట్టచీలిస్తేగాని వాళ్ళఇనుప పెట్టెలలోనున్న డబ్బు బయటకురాదు–' అంటూ కుందన లాల్ మిత్రుడంటున్నమాటలు వినిపించేసరికి సేట్ ఒణికి పోయాడు. కత్తితో అతనిపొట్ట చీలుస్తున్నట్లుగానే హడలి పోయి ఒక్కగంతులో యింట్లోకిపోయి లోపల గడియ వేసుకొన్నాడు. 'ఈగూండాలను నమ్మగూడదు. వీళ్లు తప్ప కుండా వీలుచిక్కితే నాకొంప దోచుకుంటారు. వీళ్ళముందు గాడ్రేజితాళాలుగాని, సీసపుపెంకులుగాని ఆగవు' అను కొంటూ స్విచ్ నొక్కాడు. దాంతో యినుపకటకటాలకు, తాళానికి అంతటా విద్యుత్ప్రసారమయిపోయింది. ఎవరైనా తెలియకచేయివేసెనా చావవలసిందే. పైగాయింట్లో గణగణ గంట మ్రోగుతుంది. ఈ ఉపాయము సేట్ రెండవకుమారుడు

మునిలాల్ కనిపెట్టాడు. అతడుడిటెక్టివ్ నవలలెన్నో చదివాడు. తండ్రికి కుడిభుజంలా పనిచేస్తున్నాడు. అందుచే సేట్‌కి ఇత నంటే తగని అభిమానం. గడియ, తాళాలు మరల ఒక పర్యాయం లాగిచూచి సేట్ రెండవ అంతస్థులో ప్రవేశిం చాడు. ఆభాగంలో అతని పెద్దకుమారుడూ, అతనిభార్య, నౌకర్లూ వుంటున్నారు. నౌకర్లంతా చాలాకాలంనుండి సేట్ వద్ద పనిచేస్తున్నవారే. అయినా రెండుకోట్లరూపాయ లంటే ఎవడికి కన్నుకుట్టదు? అంతదాకా యెందుకు? సేట్‌కి తన పెద్దకుమారునియందే నమ్మకంలేదు. ఎందుచేతనంటే మొగుడు పెండ్లాము ఇరువురూ, నవనాగరికపు పిచ్చి ఉన్న వాళ్ళు. ఎక్కడెక్కడిడబ్బు క్లబ్బులకు, గుఱ్ఱపుపందేలకు, చీట్లాటలకు తగలేస్తుంటారు. ఎప్పుడీముసలిపీడవదలుతుందా ఎప్పుడు మనవంతు కోటిరూపాయలు మనచేతిలో పడతవా అనుకొంటూంటారు. అందుచే సేట్ వాళ్ళగదికి, తనగదికి మధ్యనున్న వాకిలికిగూడా ఒకగాడ్రేజి తాళము, గడీ అన్నీ అమర్చాడు. అతని పర్మిషన్ లేకుండా అందులోని ఈగ యీగదిలో వాలగూడదు.

సేట్‌భార్య సంవత్సరంక్రిందట చనిపోయింది. ఆమె గుర్తుకివచ్చినప్పుడల్లా అబ్బా! ఎంత తెలివిగలది. ఎన్ని రూపాయలైనా యిట్టే లెక్కబెట్టేది. పదినిమిషాల్లో లక్ష రూపాయలైనా లెక్కబెట్టి చక్కగా కట్టలుకట్టేది. అదే యిప్పుడుంటే ఎంతబావుండును. ఈడబ్బంతా లెక్కబెట్టా లంటే నాకు రోజులురోజులు...

పై భాగంలో ఇప్పుడు తానూ తన రెండవకుమారుడు మునీలాల్ మాత్రమే నివసిస్తున్నారు. తన అనుజ్ఞలేకుండా ఆగదిలోకి నౌకర్లుగూడా రావడానికి వీలులేదు. ఒక్క మునీలాల్ మీదతప్ప అతని కింకెవరిమీద నమ్మకము లేదు. సేట్ గదిలో ప్రవేశిస్తూనే మంచముమీద పండుకొని నిద్రపోతున్న మునీలాల్ని చూచాడు. అతని చేతినున్న రత్నాంగుళీయకము దీపపుకాంతిలో మిరుమిట్లు గొల్పుతున్నది. ఆఉంగరం మొన్నపోయిన మునీలాల్ పుట్టినరోజు పండక్కి కొనిపెట్టాడు సేట్. అదే పెద్దకొడుక్కి కొనిపెట్టివుంటే రెండుర్రోజుల్లో ఖాళీచేసేవాడు. 'పెద్దవెధవనేనుపోయిన తరువాత సంవత్సరము తిరగకుండానే దివాలాతీస్తాడు. నా పేరు నిలిపితే మా మునీలాలే నిలపాలి. వాడివంతుకువచ్చిన కోటిరూపాయలు నాలుగు సంవత్సరాలలో యిరవైకోట్లు చేస్తాడు. పూవుపుట్టగానే వాసన బయలుదేరుతుంది.' తండ్రి లక్షణాలు చిన్నప్పటినుండి అతనిలో కనిపిస్తూనే ఉన్నాయి. చిన్నతనములో బడికిపోయేరోజుల్లో ఏదైనా కొనుక్కోమని తండ్రియిచ్చిన కానీ, అర్ధణా బడిలో మిగతా పిల్లలకు వడ్డీకి యిచ్చి కానీకి అర్ధణా వసూలుచేసేవాడు. అలా అతనిచదువు పూర్తిఅయేసరికి మూడువేల రూపాయలు సంపాదించి యిప్పుడు వేరే వడ్డీకి ఇచ్చుకొంటున్నాడు. అతనూ అతని అనుచరులింకా కొంతమందీ ఇప్పుడు ఫేస్‌పౌడరు డబ్బాలు, పైటపిన్నులు, రిబ్బన్లూ, సబ్బులూ, మొదలైన వస్తువులు యిండ్లకు తిరిగి బ్లాక్‌మార్కెట్ రేట్ల కమ్ముతూవుంటారు. తండ్రీ యిద్దరికి చెరియొక కారు కొనిపెట్టాడు. పెద్దవాడు తన

వంతువచ్చిన పెట్రోలు రెండురోజులలోనేకాల్చేసి బ్లాకులో కూపన్లు కొంటూంటాడు. చిన్నవాడు తనవంతు కూపన్లు బ్లాకులో అమ్మి ఏదయినా పనుంటే నడచిపోతుంటాడు. తన అన్నకైనాసరే, బ్లాకుమార్కెట్ రేటు తీసికోందే కూపను యివ్వడు. ఈ కారణంగా సేటుకి చిన్నకుమారుడంటే ఆదర మెక్కువైంది. నమ్మకం కుదిరింది—తన ఉత్తరాధికారి అతడేనని నిర్ణయించుకొన్నాడు.

అలవాటుప్రకారం తలుపుమాటునా, మంచంక్రిందా బీరువాచాటునా, మూలమూలనా పారచూచి ఎవరూలేరని నిశ్చయించుకొన్నాడు. ఇనుపపెట్టె తెరచి, సంచులన్నీ భద్రంగా వుండడంచూచి తిరిగి తాళంవేసి రెండుసార్లు లాగిచూచాడు.

'పహారా హుషార్'—

జగ్గూకేక వాయుమండలంలో ప్రతిధ్వనించింది. అతని బూట్లచప్పుడు టక్ టక్ మని వినిపిస్తున్నది. ఇంటిచుట్టూతిరిగి మరల 'పారాహుషార్' అని కేకపెట్టాడు.

సేట్ సంతోషంతో లైటుఆర్పి మంచంమీద నడుం వాల్చాడు. 'పారాహుషార్' కేక వినిపిస్తున్నంతసేపూ సేట్ కి ఏ విచారమూలేదు. దొంగలకుగూడా బుద్ధివుంటుంది. చౌకీ దారు మేలుకొనేవున్నాడు—ఇప్పుడు పోతే లాభంలేదని వాళ్ళకీతెలుసు.

ఈ చౌకీదారులే కొంపతీస్తారని, అలాకాకపోయినా తెల్లవార్లూ పారాహుషారంటూ నిద్రపోనివ్వకుండాఅరుస్తుం టారనీ, తెల్లవార్లూ మనం పారాహుషారుగావుంటే ఆవెధవ లతో పనేమిటనీ, ఎంతోమంది స్నేహితులు సేట్ కి నూరి

పోశారు. ఈ 'పారాహుషార్' అనే ఒక్కొక్క కేక సేట్‌కి లక్షరూపాయల విలువగలదని వాళ్ళకేం తెలుసు. జగ్గూ కేక వినిపిస్తున్నంతసేపూ సేట్ మంచముమీద అటూ, యిటూ దొర్లుతున్నాడు. ఒక్కసారిగా రెండునిముషాలు కేక వినిపించకపోయేసరికి సేట్ లేచి నడిమంచములో కూర్చుని 'ఏం జగ్గూ, నిద్రవచ్చిందా?' అన్నాడు.

'లేదు సేట్ జీ, బీడీకాలుస్తున్నాను.'

తిరిగి 'పారాహుషార్' అనే కేక వినబడడం మొదలెట్టగానే సేట్ మంచముమీదకు వొరిగి మొలలోనున్న తాళపుచెవులగుత్తి చేతితో గట్టిగాపట్టుకొని కన్నుమూశాడు.

'పారాహుషార్'

'పారాహుషార్'

సేట్‌కి నిద్రపట్టడంలేదు. పిచ్చిపిచ్చి కలలు రాసాగినవి. ఒకదఫా జగ్గూ లాటీతీసికొని, గుడ్లెర్రజేసి పైపైకి వస్తున్నట్లూ, మరొకసారి కుందనలాలూ, అతని స్నేహితులూ ఎర్రజండాలు చేతబట్టుకొని, యీ బ్లాక్‌మార్కెటుదార్లను చంపండి, వాళ్ళయినుపపెట్టెలు బద్దలుకొట్టండి, అంటూ పైకివస్తున్నట్లూ...ఎదోచేయి తన కంఠాన్ని నులిమిపారవేస్తున్నట్లూ... సేట్ దిగ్గునలేచాడు. ముచ్చెమటలుపోశాయి. భయంతో వణకసాగాడు.

'పారాహుషార్'

సేట్ కంఢ్లుతెరచాడు. కల అని సంతోషించాడు. తెప్పరిల్లి తాళపుచెవులు తిరిగి చేతితో పట్టుకొని పండుకొన్నాడు.

'పారాహుషార్'

చీకటిగదిలో భయంతో వణుకుతున్న సేట్‌కి యీ కేక వినిపించగానే పోయినప్రాణం లేచివచ్చింది. సంతోషంతో మనస్సు ఉప్పొంగిపోయింది.

జగ్గూ మేలుకొనేవున్నాడు, 'పారాహుషార్' అంటూ కేకపెడుతూనే యున్నాడు. జగ్గూచేతిలో బలమైన లాటీ వున్నది. దానికి రెండుప్రక్కలా యిత్తడి పొన్నులున్నవి. ఒక్కదెబ్బకు దొంగవానితల మూడుప్రయ్యలు చేయగలడు. కొట్టుముందున్న ప్రహరీగోడ చాలఎత్తైనది. దానిమీద సీసపు పెంకులున్నవి. ఎవడైనా ఎక్కడానికి ప్రయత్నిస్తే వాడి రక్తం కళ్ళజూస్తాయి.

దుకాణానికున్న వాకిలి నాచేతితో బంధించాను. తాళము సరిగా వేశాను. దానికంతా కరెంటుపాస్ చేశాను. ఎవడైనా చేయివేస్తే మాడి మసికావలసినదే. కుందనలాల్ కాదు. వాడితాతయినా...

తనకు, పెద్దకుమారునిమధ్యనున్న వాకిలిగూడా తాళం జాగ్రత్తగా వేశాడు. ఒకవేళ ఆశాపిశాచమావరించి పెద్దకుమారుడు తనపైకి రావాలన్నా రాలేడు.

ఇనుపపెట్టెకు తాళం జాగ్రత్తగా వేశాను. తాళపు చెవులు నామొలలోనే కట్టుకొన్నాను. నాప్రియమైన మునీలాల్ యిదిగో యిక్కడే నాగదిలోనే పండుకొన్నాడు. ఒక్కకేక బెడితే తన పిస్తోలుతీసికొనివచ్చి దొంగవెధవలను కాల్చిపారేస్తాడు. నా మునిలా లుండగా నాయింటిపై పెవరూ కన్నెత్తి చూడలేరు.

'పారాహుషార్'.

'సేట్‌కి ఎవరూ ద్రోహం తలపెట్టకండి! ఆయన ధనాన్ని రక్షిస్తానని నేను మానవత్వాన్ని చంపుకొని కుక్కలా ఆయనవాకిలి కావలికాస్తున్నాను' అనేదే ఆమాట కర్థమనుకొంటాను.

పారాహుషారనే కేక సేట్‌కి గంధర్వగానంలా గున్నది. కన్నుమూశాడు.

'పారాహుషార్' 'పారాహుషార్'.

ఆ కేక అతని మెదడులోదూరి లేపడానికి ప్రయత్నం.

చేతిప్రేళ్లు...?

తిరిగి భయంకరమైన స్వప్నం...?

తాళపుచెవులెవరైనా లాక్కొంటున్నారా...?

లేక యిది యథార్థమా...?

మొలత్రా డిలా తెగిపోయినదేం? ఒకవేళ ప్రక్కకు వొత్తిగిలినప్పుడు... లేక ఎవరైనా తాళపుచెవులకొరకై మొలత్రాడు త్రెంచి దానితో నాగొంతు...నాగొంతు?

మునీ! ఓ మునీ అంటూ పిలవబోయినాడు. కాని సేటుకిమాటపిగిలిరాలేదు. మొలత్రాడు తెగి వ్రేలాడుతున్నది.

'పారాహుషార్'

జగ్గూ కేక దశదిశలా ప్రతిధ్వనిస్తూనే వున్నది—కాని ప్రయోజనం? ప్రాణంపోవడానికి కొద్దిక్షణాలే ఆలస్యం.

ఈ బ్లాక్ మార్కెటుదార్ల పొట్టలు చీలిస్తేనేగాని- వాళ్ల ఇనుపపెట్టెలలోమూలుగుచున్నధనంబయటికిరాదంటూ

కుందనలాల్ స్నేహితుడన్నమాటలు సేట్ జీ చెవులలో ప్రతి ధ్వనిస్తున్నాయి. ఆవెధవ యీగదిలోకి ఎలా రాగలిగాడు? వాకిలికి ప్రసారమైన ఎలెక్ట్రిక్కుషాకు తగిలితే వీడు చావ వలసిందేనే! ఒకవేళ కరంటు ఆగిపోయిందా! కరెంటు ఆగి పోయినా ఆ విషయం తెలియజేయడానికి కూడా గంట కొడుతుందే?

జగ్గూ యెక్కడ నిద్రపోతున్నాడు? 'పారాహుషా' రంటూ అతను పండుకొన్న కిటికీ క్రిందనుంచే కేక వినిపించింది. వెధవా! నీవక్కడ పారాహుషార్ పారాహుషా రంటూ పొలికేకలు వేస్తున్నావు. ఇక్కడెవరో నా మొల్రతాటి గొలుసుతోనే నాపీక ...

రెండుకోట్లరూపాయ లెంతకష్టపడి సంపాదించాను. పదిసంవత్సరాలు వ్యాపారం మందకొడిగా ఏడ్చింది. ఇంతలో బెంగాలుకరువు వచ్చింది. బియ్యంవ్యాపారంచేశాను. ఏదో అదృష్టం కలిసివచ్చింది. బియ్యము, పెట్రోలు, గుడ్డలు బ్లాకులోఅమ్మి నాలుగురాళ్ళు సంపాదించాను. ఏదో లంచా లంటూ లేకపోతే యింకా రెండుకోట్లు కళ్ళజూచేవాడిని. నానాగడ్డికరచి సంపాదించానే హేభగవాన్! ఇదేనా నీ న్యాయం నీకెన్నోసార్లు సహస్రఘటాభిషేకాలూ, లక్షపత్రి పూజలూ చేయించానే—ఒక్కసారి నాగొంతు వదలి పెట్టించు—మునీలాల్ని పిలుచుకొంటాను. వాడీ గదిలోనే యున్నాడు. పిస్తోలుతీసుకొనివచ్చి యీవెధవను—హే భగ వాన్—ఒక్క—

'పారాహుషార్'

అబ్బా! ప్రాణంపోయేలాగున్నది. ఈగాడ్రేజి తాళా లన్నీ ఎలా తీయగలిగాడు? మరి ఆ సీసపుపెంకులు—? రెండు వైపులా పొన్నులున్న జగ్గూలాటీ—? ఆయినుపకవాటం— ఆకరెంటు—? ఇవన్నీ తప్పించుకొని ఎలా రాగలిగాడు—?

'పారాహుషార్'

జగ్గూ కేక దూరాన్నుండి వినిపించింది.

అతడు గుడ్లు తేలవై చాడు. ప్రాణాలు పోలేకపోలేక పోతున్నాయి. అతనిమెడకు తగిలించినగొలుసు కొంచెము కొంచెముగా బిగుసుకోసాగింది. ఆకాశపుటంచులనుండిపైపైకి ప్రాకివస్తున్న శుక్రునికాంతిలో ఏదో తళుక్కుని మెరసి అంతలో మాయమైంది. కాదు. కాదది, నక్షత్రపుకాంతికాదు. ఏదో అంగుళీయకములోనున్న రత్నం.

దూరాన్నుండి పారాహుషారనే జగ్గూకేక యింకా వినిపిస్తూనేయున్నది.



# కుంకుమపూవు

రా బాబూ! కొంచెంసేపు చెట్టుక్రింద విశ్రాంతితీసుకో. దాహం తీసుకొనివస్తాను. ఆ కనిపించే ఉదారంగుమోటారు నీదేననుకొంటాను. టైరుకి పంచరుపడిందా? ఫరవాలేదు నాయనా! చీకటిపడకముందే శ్రీనగరుచేరుకోవచ్చు. అంతా ఇరువదిమైళ్లు కూడా లేదు. వద్దు నాయనా! వద్దు. ఒకగ్లాసు మంచినీటికి మేమేమీ డబ్బుతీసుకోము. మాకింకా నీళ్ళూ, నిప్పూ అమ్ముకొనే దుర్గతి పట్టించనందులకు భగవంతునికి నా ధన్యవాదాలు. అయినా యీ పావలా బేడా తీసుకొని నేనేమి చేసుకొనేది నాయనా! నా అనేవాళ్లెవరూ ఈ ప్రపంచంలో నాకు లేరు.

ఒంటరిదానను. అవును, ఒంటరిదానను. పిల్లాజెల్లా గాని, భర్తగాని, బంధుమిత్రులుగాని ఎవరూలేరు. ఈచేనుకి కావలి కాస్తున్నాను. ఏదోవిధంగా భగవంతు డింత ముద్ద చూపించాడు. కాటికి కాళ్లుచాచి కూర్చున్న అరవై ఏండ్ల ముసలిదానను. డబ్బుతీసుకుని ఏమిచేసుకోను నాయనా! ఈవాళ నేనుచచ్చిపోతే రేపు నన్ను తలిచేవారుండరు. ఇంక

నాకీ ప్రపంచాన్నంతా మూటగట్టవలెననే కాపేయమెందుకు నాయనా! ఏమంటావు నాయనా? కావు, కావివి, గసగసాలు కావు. కుంకుమపూవు. కుంకుమపూవు ఈ నేలలో బాగా పైరవుతుంది. ఆఁ అవును, అంతేనాయనా! కుంకుమపూవులలో పసుపుపచ్చని పుష్పాడివుంటుంది. నేడుగూడా నీపీరోడ్డు వెంట పచ్చని పుష్పాడియున్న కుంకుమపూవును దారిపొడుగునా చూడగలవు. కాని ఈ ఏడు యీ చేనిలోని కుంకుమపూవు ఎరుపుకు తిరిగింది. రక్తవర్ణము—ఎందుకా ? భగవంతుని చిద్విలాసము—కాని మీ నవయువకులు దీని నంగీకరించరు. మీరనుకుంటారు—పాప మీ కాశ్మీరు దేశస్థులు అమాయికులు, మూఢవిశ్వాసంగలవారని.

ఈచేలో కుంకుమపూవే ఇలా రక్తవర్ణంగామారినకథ వినాలని కుతూహలపడుతున్నావా? యింకా కొంచెంసేపట్లో నీ మోటారు బాగవుతుంది. నీవు వెళ్ళిపోతావు. కాని కథ అసంపూర్ణంగా ఇక్కడే నిలిచిపోతుంది. నిత్యమూ ఈరోడ్డు వెంట మోటార్లు పరుగెడుతూనేవుంటాయి—వందలు, వేలు. వారుగూడా ఇలాగే ఒకటిరెండు నిముషాలాగి తరువాత దుమ్ము రేపుకొంటూ వారిదారిన వారు వెళ్ళిపోతారు. కాని ఈ కుంకుమపూవుమాత్రం కోసేవరకూ అలాగే చేలోవుండిపోతుంది. పంటకొచ్చిన తరువాత దీనినంతాకోసి ఎండబెట్టి ప్రపంచం నలుమూలలకూ పంపబడుతుంది.

మనదేశంలోనేగాదు, విదేశాలలోగూడా వారివారి ఆహారపదార్థాలలోవేసిన యీ కుంకుమపూవు వాసనలకు ముగ్ధులై నీలాగే వారుగూడా కుంకుమపూవుకు ఈవాసన

ఎర్రదనం ఎలావచ్చినదా అని ప్రశ్నిస్తారు. కాని చెప్పగల సమర్థులేరి? ఈ ప్రపంచంలో నాకుతప్ప మరొకరి కీ విషయం తెలియదు.

ఏమిటిరా యీపిచ్చిదిలా వాగుతుందనుకొంటున్నావు కదూ? నీవు నిజంగా కుంకుమపూవునకు యీ ఎఱ్ఱదనంఎందులకు వచ్చినదో తెలుసుకొనవలెననుకొంటున్నావా? లేక నీ మోటారు బాగయేటంతవరకు కాలాన్ని చంపుదామనుకొంటున్నావా?ఏమైనాసరే ఇదీనాకథ. వినదలచుకొంటేవిను.

ఈ సంవత్సరమే యీ చేనిలో కుంకుమపూ విలా ఎర్రగా మారింది. అంతకుముందు అన్నిచేలలోవలెనే ఈ చేనులోనూ ఉండేది. కాశ్మీర్ శాలువ ముసుగుపెట్టుకొన్న పెండ్లికూతురులా యీ లోయంతా కళకళలాడేది. ఈచుట్టూ రెండుమూడు మైళ్ళవరకూ కమ్మని వాసనలు క్రమ్ముకొనేవి. కారులు రేపుకొంటూపోయిన దుమ్ముకూడా కుంకుమపూవు వాసనతో ఘుమఘుమలాడేది. భూమి మొదలు ఆకాశం వరకూ ప్రతివస్తువూ కుంకుమపూవువాసనలను విరజిమ్మేది.

చాలాకాలము క్రిందటిమాట. ఒకాయన ఈ దారిని పోతూఅప్పుడప్పుడే వికసిస్తూన్న కుంకుమపూవును చూచి అలా నిలబడిపోయాడు. అత డలా చేనుమధ్యకంటా పోయి అదొక దృష్టితో కుంకుమపూవాసనల నాఘ్రాణింపసాగాడు. కాదుకాదు. ఈ వాసనలను, ఈ ప్రకృతి సౌందర్యాన్ని కన్నులతో త్రాగుతూ ఏదో మెల్లగా గొణగ సాగాడు—
'నేను పరాయివాడిని...'–'ఎందుకుకాదూ? ఏమిటయ్యా గొణుగుతావ్' అని నేననగానే...'నాకు నవ్వు ఎందుకురావ

డంలేదు? నేను అన్యదేశీయుడననా? పుస్తకాలలో స్పష్టంగా వ్రాసినారే! నీవు కుంకుమపూచేలోకి పోతే తప్పక నవ్వు తావు అని. మరి నాకు నవ్వెందుకురాలేదు? అన్య దేశీయుడ ననా?' అని అతని విచారం. పైగా నవ్వడానికి అతనికి నేను సాయపడలేదని మొగమింతచేసుకొన్నాడు.

ఇంతలో అకస్మాత్తుగా చితుకుపుల్లలమోపు నెత్తిన బెట్టుకొని జఫ్రాణి అక్కడకువచ్చింది. ఈవిషయాన్ని నే నామెకు చెప్పగనే కడుపుబ్బ నవ్వసాగింది. ఆమెనవ్వుచూడ గానే ఆ అన్యదేశీయునకు చికాకు, తత్తరపాటు కలిగాయి. కోపముకూడా వచ్చిందనుకుంటాను. చేసేదిలేక జఫ్రాణితో పాటు అతనూ నవ్వసాగాడు. ఈదృశ్యాన్నిచూచి నేనుగూడా నవ్వకుండా వుండలేకపోయాను. ఇంతలో అతగా డన్నాడు 'చూచారా? పుస్తకాలలో వ్రాసినదంతా యథార్థం. ఈ చేలోనున్న ముగ్గురం నవ్వుతున్నాము... అవునా...?'

పెద్దదానినయాను నాయనా, చెవులు వినిపించవు. కండ్లు కనిపించవు. ఇప్పుడు చెప్పినమాట కొంచెము సేపట్లో మరచిపోతాను. ఏమిటోచెప్పవచ్చి మరచిపోయాను.-ఏమిటం టావు నాయనా? జఫ్రాణి ఎవరనా అడుగుతున్నావు.జఫ్రాణి నాకూతురేనని యిదివరకు చెప్పలా నీకు? మరచిపోయి వుం టాను. చూచావ్రగానాయనా, నామతిమరపెలాగున్నదో— ఆమె అసలుపేరు నూరాజ్. కాని ఊరిలోవారంతా ఆమెను జఫ్రాణి అనిపిలుస్తారు. ఆమెకు యౌవనం రాగానే ఊరిలో వారంతాఅనేవారు, ఇంతచక్కనిచుక్క మనదేశం మొత్తం

మీదేలేదని. ఆమెశరీరం కుంకుమపూవర్ణమని, ఆమె కన్నులు తామరపద్మాలని ఊ వర్ణించేవారు.

కాని నేను స్వయంగా ఆమెలో ఈ అందాన్ని చూడ లేదు. ఆమె చాలా సన్నగా, ఏటి అంచున పెరిగే రెల్లు పుల్లలా వుండేది. ఇలాంటి సన్నని వాండ్లకు పెండ్లిచేస్తే పిల్ల లెలాపుడతారా ? అనుకొంటాను. పైగా ఆమెకు పెద్ద వారితో ఎలా మెలగాలో చిన్నవాళ్ళతో ఎలా మసలాలో బొత్తుగా తెలియదు. నే నెప్పుడూ ఆమె కంత చనువివ్వక పోయినా ముగ్గురు మొగబిడ్డల సందున ఆమె ఒక్కతే ఆడ పిల్లగావటాన తండ్రి. ముగ్గు రన్నలు ఎంతో గారాబంగా చూచేవారు. నేను భయపడేదానిని—ఈబీదపిల్లను, అల్లరి పిల్లను ఎవరు పెండ్లాడుతారా అని. ఇప్పటికాలపు మీలాంటి యువకుల అభిరుచులువేరు నాయనా... కట్నాలు... కాను కలు, పిల్లకాయ మంచిచెడ్డలు, రూపురేఖలతో పనిలేదు.

అయినా ఏవేవో పెండ్లి సంబంధాలు వస్తూనే ఉన్నాయి. ఆఖరుకు,ఈ చేను ఆసామి ఒకచిన్న జాగీరుదారు. తన మూడో అబ్బాయికి జఫ్రిణిని యివ్వవలసినదని కబురు చేశాడు. పిల్లవాడు చదువుకొంటున్నాడు కూడానట. నీవు చెప్పు నాయనా, బీదరైతులం ఇలాంటి పెద్దసంబంధాల కాశింపవచ్చునా? దాని నొసట ఎలా వ్రాసివున్నదో అలా జరుగుతుంది. దానిని తప్పించేవారెవరని నేను దాని భవి ష్యత్తు విషయం దానికే వదలివేసి వూరుకొనేదానిని.

ఇంతలో ఎప్పుడైతే యింటికైన పెద్దతల పోయిందో అప్పులవాండ్లంతా ఒక్కసారి ఎగబడ్డారు. పొలము వేలము

వేసుకొనిపోయారు. అప్పటికీ నేను ధైర్యాన్నికోలుపోలేదు. అప్పటికి నాముగ్గురుకొమాళ్ళూ వున్నారు. వీరే నానిజమైన సంపద, నాభాగ్యం. నాలుగు కాలాలపాటు భగవంతుడు తిన్నగాచూస్తే వాళ్ళే సంపాదించుకొంటా రనుకొనేదానిని. కాని జఘాత్రిణినిగురించే నాకు రాత్రింబవళ్ళూ విచారంగా వుండేది—దానికన్నులు తామర పద్మాలులాగున్నా, దాని శరీరం కుంకుమపూవర్ణంగానున్నా, ఈ అనాథ బీద బాలికను ఎవరు పెండ్లాడుతారా అని.

ఎన్నో తరాలనుండి మే మీా గ్రామాన్ని, భూముల్ని కనిపెట్టుకొని జీవయాత్ర సాగిస్తున్నాము. కొంతకాలము పంటలు బాగా పండుతవి; కొంతకాలము ఎండుతవి. ఒక్కొక్కప్పుడు వర్షాలుకురుస్తవి; ఒక్కొక్కప్పుడు చినుకైనా పడదు. ఒక్కొక్కసంవత్సరం అధికవర్షాలు కురిసి వరదలు వచ్చి పంటంతా నాశనమైపోతుంది. మాచేలో పనుంటే మా పని చేసుకొంటాము. లేకుంటే యితరులకు కూలికిపోయే వాళ్ళం. విధి బలీయమన్నారు. ఎలా తప్పించుకోగలం నాయనా! నాయనోయ్! ఒక్కొక్కప్పుడు పోలీసువాండ్లు గూడా చాలా ఏడిపించేవాళ్ళు—కోళ్ళను తెమ్మని, కొంక్కరాయల్ని తెమ్మని. లేకుంటే పండినపంటంతా జప్తుచేసే వాళ్ళు. ఎలాగైనా ప్రభువులు ప్రభువులే. మనం మనమే. ఇది కలియుగం నాయనా! ధర్మం అరణ్యాలలో వుంటుంది, మానవులలో వుండదని చెప్పనే చెప్పారు. కలియుగంలో రోజూ ఎంత మారణహోమం, ఎన్నెన్ని చిత్రాలు చూస్తున్నాము నాయనా!

ఎప్పుడో మావారు బ్రతికివున్నప్పటిమాట ; ఒకనాడేమి జరిగిందంటే, నేను వాకిట్లోకూర్చుని బియ్యం చెరుగుతున్నాను. మా రెండోవాడు 'నూరూ' చప్పట్లుకొట్టుకుంటూ అమ్మా ! కాశ్మీరుసింహం వచ్చింది, కాశ్మీరు సింహం వచ్చిందంటూ పెద్దగా కేకలుపెట్టసాగాడు. ఈ లోయలోకి సింహాలూ, పెద్దపులులూ వచ్చినవని వినడం యిదే మొదటి సారి. సింహమయితే తుపాకితీసుకొని వెంటనే రావలసినదని జాగీరుదారుతో పోయిచెప్పరా అనేలోపలనే నూరు వెనుకకు పరుగెత్తాడు. ఇలా తలఎత్తి చూతునుగదా-ఆబాలగోపాలము, ఊరంతా కదలిపోతున్నట్టున్నది. ఒకవేళ ఆసింహాన్ని పట్టుకొనివుంటారు, చూడడానికి వీళ్ళంతా పోతున్నా రనుకొన్నాను. నేనూ బయలుదేశాను.

ఆ దృశ్యాన్ని నా యీ జీవితంలో మరచిపోలేను. ఊరికి ఆప్రక్కన అదిగో ఆకనుపించే చెట్టుక్రింద ఒక బడియిల్లు వున్నది. ఆరోజులలో అది ప్రాథమిక పాఠశాలగా వుండేది. ఇప్పుడుదానిని మిడిల్‌స్కూలు చేశారు. నేనా పాఠశాలవద్దకు చేరగానే అక్కడొక పెద్దగుంపుచేరియున్నది. కొంతమంది సభామంటపాని కెదురుగా కూర్చుని ఉన్నారు. వారి వెనుక కొంతమంది నిలచి ఉన్నారు. పాఠశాల ఆవరణ అంతా పచ్చనితోరణాలతో అలంకరింపబడింది. సభావేదిక మీద ఒక సింహంగాని, చిరుతపులిగాని లేదు. పొడుగాటిసాదా మనిషి, చేతులు త్రిప్పుకొంటూ బిగ్గరగా ఏదో చెప్పుతున్నాడు. ఇదే కాశ్మీరుసింహమని తరువాత నాకు తెలిసింది. సింహము నిజంగా వచ్చిందని అనవసరంగా ఎంతభయపడ్డాను!

అల్లరిపిల్లలు అల్లరికథ అనుకొన్నాను. ఇతడుసింహనూగాదు, చిరుతపులీగాదు. కనీస మొక పోలీసుజవానయినా అయిఉండడు. పోలీసులు యిలాంటి గుడ్డలు వేసుకోరు. వాళ్ళ డ్రస్సు వేరు. ఇతడెవరో తేయాకు అమ్ముకొనేవాడయివుంటాడు. అతని దగ్గిరనున్న నల్లని పెట్టెలోనుండి గొట్టము ద్వారా నాలుగు మాటలు వినిపించి తేయాకు అమ్మకము సాగిస్తాడు గాబోలు. శాంపిలు టీ పొట్లా లిస్తాడని నేనుగూడా దగ్గరకు పోయి నిలచాను.

కాని అతడు స్వచ్ఛమైన కాశ్మీరుభాషలో మాట్లా డడంచూచి ఆశ్చర్యపోయాను. అతడు అమ్మేది నిజంగా టీయే అయితే నిజంగా చాలా అపాయకరమైన టీ. మొదటి కొద్దిమాటలు వినేసకి నాకు భయమేసింది. ఈ ఊరిమీద ఏదో ఆపద విరుచుకుపడబోతున్నదనుకొన్నాను. 'ఈభూమికి నిజమైన హక్కుదారులం మనం. దున్నేవానికే భూమి ఉండాలి. తరతరాలనుండి మనమీ భూమాతను నమ్ముకొని జీవిస్తున్నాము. ఈ హక్కు రైతుబిడ్డలమైన మనదేగాని ఈ రాజులదీ రంగప్పలదీగాదు. వారి దృష్టిలో మనం పురుగుల కంటే నీచంగా చూడబడుతున్నాము. ఇది సహింపరానిది. మన రక్తాన్ని పిండుకొని ఈ జాగీరుదార్లూ, జమీందార్లూ, పొట్టలుపెంచుకొంటున్నారు. చెమట వోడ్చిమనం పండించిన పంటంతా వీళ్ళు దోచుకుపోతున్నారు. మనమంతా ఐక్య కంఠంతో యీ దురాక్రమణన్ని ఎదిరించాలి. మనమంతా ఐక్యం కావాలి. మనం మనస్వాతంత్ర్యముకొరకు పోరాడాలి. మనం మనపిల్లలను బడికి పంపించాలి. మీరంతా మీ మీ

పిల్లకాయలను విధిగా చదివించాలి. ఎందుకంటే కాశ్మీరు భవిష్యత్తంతా వారి మీదే ఆధారపడి యున్నది. వారే కాబోయే నాయకులు.' ఇంకా ఆయనేమేమి భయంకర వాక్యాలు పలికినాడో నాకు తెలియదు. నేను చివరంటా వినలేకపోయాను.

జఫ్రాణి మాత్రం ఒకమూల కూర్చుని నోరుతెరచుకొని ఆయన ఉపన్యాసాన్ని వింటున్నది. ఆయన పెదవుల నుండివచ్చే ప్రతివాక్యాన్ని అందుకొని హృదయంలో పాఠేస్తున్నది. నాకు భయమేసింది. వెంటనే చెవిపట్టుకొని యివతలకు లాక్కొచ్చి యిల్లాంటిచోటికి యికనెప్పుడూ రావుగదా అని వీపుమీద రెండంటించాను..

ప్రశాంతముగానున్న సరస్సులో ఒక్కరాయి విసిరితే ఏమి జరుగుతుందో నీకు తెలుసునాయనా! అలానేశాంతంగానున్న ఈ గ్రామంలో విప్లవాగ్ని రగుల్కొన్నది.' జమీందారీ విధానం నశించాలి. ప్రజారాజ్యం నెలకొల్పాలి' అనే నినాదాలు ఎక్కడజూచినా వినిపించసాగాయి. 'మీతాతలు, తండ్రులు యీ జమీందారీలక్రిందే ఎన్నోబాధలుపడుతూ, ఆరాక్షసత్వాన్ని సహించి, మ్రింగి జీవించలేదా? మీరేమైనా వారికంటె పొడిచి గెలిచారా?'అని వారితో వాదించేదానను. కాని నామాట ఎవరికికావాలినాయనా! ప్రజలంతా ఆకాశ్మీర్‌సింహపు పంజాలో యిరుక్కుపోయారు. కుంకుమపూవునకు ఈ ఎరువు ఎందుకువచ్చిందో చెప్పమంటే ఇదేమిటిరా ఈముసలిది పాడుసొదంతా వెళ్ళబోస్తున్న దనుకొంటున్నావుకదూ? నేనింకొక విషయాన్నిగురించి కాదు చెప్పేది

నాయనా, ఆవిషయాన్ని గురించే! కాని కాశ్మీరుసింహం ఉప న్యాసానికే ఈ పూవు లిలా ఎర్రగా మారిపోలేదు. మరి ఎలా మారినవంటావు—అలా అడుగు కొంచెం ప్రశాంతంగా వినే ఓపిక వుంటే చెపుతాను విను.

ఆ ఉపన్యాసమైన నాలుగు మాసాలకు కాబోలు—కాశ్మీరు సింహాన్ని పట్టుకొని ఖయిదులో పెట్టారని తెలిసింది. కాని కాశ్మీరు మహారాజా చాలా మంచిపనిచేశాడు. తిరిగి దేశంలో ఎప్పటి పరిస్థితులు ఏర్పడగలవనుకొన్నాను. కాని నేను పొరపాటుపడ్డాను. ఆయన అరెస్టు అనగానే ఆయన పేరుప్రతిష్టలు ఇనుమడింపసాగాయి. ఎవరినోట వినబోయినా ఆయన పేరే. ప్రజలంతా ఆయనను అరెస్టుచేసినందుకు మహారాజాను దుమ్మెత్తిపోయసాగారు. కాశ్మీరు గవర్నమెంటుకు రోజులు దగ్గరకొచ్చాయనేవారు.

ఈ విషయంలో నాముగ్గురుబిడ్డలను ఆపలేకపోయాను. 'జమీందారీవిధానం నశించాలి. షేక్ అబ్దుల్లాను విడుదల చేయాలి' అనే నినాదాలుచేస్తూ పూరేగేవారు. సర్కారు వారికి లాభంలేదని కొన్నాళ్ళ కాయనను విడుదలచేశారని విన్నాను.

ముసలాయన బ్రతికి వున్నంతకాలమూ ఏలోటూ లేకుండానే జరిగిపోయింది. తరువాత పూలమ్మినచోటనే కట్టెలమ్మవలసివచ్చింది. ఇంతబ్రతుకూ బ్రతికి కూటికి గూడా మొహంవాయవలసివచ్చింది. ఇదంతా మాపెద్దవాడుగులాం నబీకి కష్టమనిపించింది. 'అమ్మా, వేసవికాలంలో కాశ్మీరు చూడటానికి గొప్ప గొప్పవారు వస్తూవుంటారు. నేను

శ్రీనగరుపోయి మూటాముల్లెమోసి రోజుకు రెండుమూడు రూపాయలు సంపాదించగలను. ఎరిగినచోట ఈ అవస్థ పడే కంటె చాటున...' అతని అభిప్రాయాన్ని మార్చటానికి నే నెంతో ప్రయత్నించాను. కాని లాభం లేకపోయింది. నేనన గూడదుగాని నాయనా! వాడెలాగుండేవా డనుకున్నావ్— తీర్చిదిద్దినట్లుండేవాడు. 'బతకని బిడ్డ బారెడన్నారు— ఆరు మాసాలు శ్రీనగరులో మూటలుమోసి తిరిగిఒకనాడు ఇంటికి వస్తే ఊరిలో ఎవరూ అతనిని గుర్తుపట్టలేకపోయారు. ఏము న్నది? ఉత్తయెముకలగూడు. కండ్లు లోపలకుపీక్కుపోయాయి. అతని నెత్తి కాయకాసిపోయింది.

ఆ రాత్రంతా దగ్గుతెరలు తెరలుగావచ్చి ఒక్కొక్కసారి తెలివిలేకుండాపోయేది. తెలివిరాగానే 'అమ్మా! నీవు నన్ను గురించి భయపడబోకు. గుల్‌మార్గునుంచి శ్రీనగరు మూటలు మోస్తూ వర్షానికి తడిశాను. కొంచెం జలుబుచేసింది, అంతే. భయపడకమ్మా' అనేవాడు. తిరిగి శ్రీనగరువెళ్ళేటప్పుడు మా రెండోవాడు నూరూగూడా 'అమ్మా! నేనుగూడా అన్నయ్యవెంట పోయి కూలోనాలో చేసుకొంటా' నని బయలుదేరాడు. నేను వద్దని బ్రతిమాలాను. 'అమ్మా! ఇక్కడుండిచేసేదేమిటి? నలుగురిలో నగుబాట్లుకావటంతప్ప. ఏదో చాటుకుపోయి కూలోనాలోచేసి నాలుగుడబ్బులుసంపా దిస్తాను' అంటూ యిరువురూ కలిసి వెళ్ళిపోయారు.

కొంతకాలమైనతరువాత జాగీరుదారువద్దనుండి నాకు తాఖీదువచ్చింది.'జాగ్రత్త! నీకుమారులు గులాంనబీ,నూరూ ఇరువురూ షేక్ అబ్దుల్లా పార్టీలో చేరారు. వీరిరువురూ ఒక

షికారుబోటులో బయలుదేరి ప్రచారంచేస్తున్నారట. నీవు తగు జాగ్రత్త తీసుకోనకపోతే నిన్నేంచేస్తానో చూడ'మని తాఖీదు.

షేక్ అబ్దుల్లా! అతనికొకపార్టీ. ఈయనెవరసలు! ఒక బపిపంతులు మొదట్లో. ఈరైతులు, ప్రజలంతాకలసి ఆయ నొక నాయకుణ్ణిచేశారు. ఆపేరు నాదగ్గరెత్తకండి అని ప్రతి వారితో వాదించేదానను. ఆరోజునుండి వాళ్లు నాకొడుకులు కారు. నేను వాళ్ళ తల్లినికాదు అనుకున్నాను. దీనికేమిగాని, జఫ్రాణి ఏమైందో చెప్పమంటావ్. మరిచాను, ఆమెవిషయం చెప్పడం పూర్తిగా మరచాను నాయనా. తరువాత మా యింటిలోనే నేనూ, జఫ్రాణి, పసివాడూ మిగిలాము. జఫ్రాణికి ఇరవయ్యోయేడు వచ్చింది. కాని పెండ్లికాలేదు. చేతిలో దమ్మిడీలేక పెండ్లి ఎలాచేసేది! మరీ యీ యుద్ధము వచ్చి నప్పటినుండీ, ప్రతివస్తువుధరా మంటమండిపోతోంది. మే మిరువురముకలిసి పగలంతా ఒడలు విరుచుకొన్నా పొట్టకు చాలేదికాదు. కూలికిపోయేవారము. ఏకులు వడికేవారము. కట్టెలుకొట్టుకుని అమ్మేవారము. ఎన్నిచేసినా పొట్టనిండడం గగనమయ్యేది. మా చిన్నవాడు గఫూర్‌కు పదోయేడు వచ్చింది.

నేను వాడిని ఎవరి గొడ్లదగ్గరైనా పెడితే వాడిపొట్ట వాడు పోసుకొంటాడనుకున్నాను. కాని జఫ్రాణి వానిని బడికి పంపుదామన్నది. నీకేమైనా మతిపోయిందా అన్నాను. మరు నాడు నాతో చెప్పకుండానే జఫ్రాణి గఫూరును బడికి పంపిం చింది. నేనేం చేసేది? ఇరవైఏండ్లువచ్చిన పిల్లమీద చేయి

ఎలాచేసుకొనేది? ఇన్నితరాలకుగాను ఈ వంశంలో ప్రథమ పర్యాయంగా ఒక పిల్లవాడు బడికిపోయాడు. ఏమి పుట్టి మునుగబోతోందోనని మనసులో ఎప్పుడూదిగులుగాఉండేది. జగ్రఫాణిమాత్రం నిర్భయంగా తమ్ముని చదువు విషయంలో చాలా శ్రద్ధతీసుకొనేది. వానిని క్షణం ఊరుకోనిచ్చేది కాదు. రాత్రింబవళ్ళు చదివించేది. బడినుండి తిరిగి రాగానే ఒక్క నిమిషమైనా ఆటలాడుకోనిచ్చేదికాదు. తెలియని లెక్క ఏదైనా ఉంటే వెంటనే పంతులుగారివద్దకుపోయి చెప్పించుకొని రమ్మని ఆ అర్ధరాత్రివేళ తరిమేది. ఒక్కసారిగా పుస్తకాలన్నీ నూరి అతనిచేత త్రాగించాలని ఆమె వూహ.

రేగుచెట్టు దొడ్లోవుంటే రాళ్ళదెబ్బలు తప్పవట. జఫ్రిణి నిండు యౌవనవతి. ఇప్పటికాలపు మగపిల్లలు ఉత్త అల్లరిగుంపు. ఈ పాడు సినిమాలూ నాటకాలూచూచి మరీ చెడిపోతున్నారు. ఒకనాడు పుల్ల లేరుకొని రావడానికై పోయిన జఫ్రిణి ఏడుస్తూ ఉత్తచేతుల్తో తిరిగివచ్చింది. ఏమి జరిగిందని అడిగితే చెప్పలేక బిగ్గరగా ఏడ్చింది. ఏమి జరిగిందో చెప్పమని బుజ్జగించి గుచ్చిగుచ్చిఅడిగాను. 'ఏమీ లేదమ్మా! నాకు పెండ్లి చెయ్యి' అన్నది. ఈ వాక్యాలు నా హృదయాన్ని బాకులా దూసుకుపోయాయి. ఈ మాట్లాడేది నా జగ్రఫాణియేనా? పవిత్రభారతంలో ఏ పిల్లయినా తల్లినిలా అడుగుతుందా? ... కారణమడిగాను. ఆమె ఏడుస్తూనే జాగీరుదారు కొడుకు-చదువుకొనే గుంటడు-చేయిపట్టుకొని చేలోకి లాగబోయాడట. తను లాగి చెంపకుబెట్టి కొట్టిందట. అతను కండ్లు తిరిగి క్రింద పడ్డాడట. తాను తప్పించుకొని

పారిపోయివచ్చిందట. అతనింకా తన కండ్లముందు కనిపిస్తు న్నట్లే ఉలుకులికిపడుతూ ఏడ్వసాగింది. 'అమ్మా నాకు పెండ్లి చెయ్యి; లేకుంటే మనవంశగౌరవం 'ఎవరో ఒక రిలానే నుంట గలుపుతారు.'

'అమ్మా! నాకు పెండ్లిచెయ్యి.' నీవు చెప్పు నాయనా ఈ పరిస్థితులలో ఒక ముసలి ముండ ఏమి చేయగలదో? చేతిలో దమ్మిడీలేక నేను నా కుమార్తె పెండ్లి ఎలా చేయ గలను? ఎంత తూతూమంత్రంగా చేయాలన్నా కనీసం యాభై రూపాయలైనా కావాలి. నావద్ద యాభై దమ్మిడీలు గూడా లేవు. పోనీ ఏదైనా తాకట్టుపెట్టి చేద్దామన్నా ఇంట్లో కుండపెంకులు వినా మరో గట్టివస్తువు లేదాయె. దాని కన్నులు తామరపద్మాలులాఉన్నా, దానిశరీరం కుంకుమ పూవర్ణంగానున్నా ఏంప్రయోజనం నాయనా?

దాని పెండ్లి విషయమై యిలా దిగులుపడుతుండగా ఒకనాడేమిజరిగిందంటే: ఎవరో ఒకతను, వాలకాన్ని బట్టి కూలీ అనుకున్నాను. నలభై సంవత్సరాలుండొచ్చు, లేకుంటే అరవై సంవత్సరాలుండొచ్చు. ముఖ కవళికలనుబట్టి కూలీ వయస్సు నిర్ణయించడంకష్టం నాయనా. 'నాపేరు మహమ్మద్. నేను మీ పెద్దబ్బాయి గులాంనబీ స్నేహితుణ్ణి. గులాంనబి యీ మూట మీకివ్వమన్నాడు.' అంటూ గుడ్డపీలికలలో చుట్టియున్న చిన్నమూట నాచేతికిచ్చాడు. నేనువిప్పి67-10-0 లెక్కబెట్టినాను. ఈడబ్బుతో జహ్రిని పెండ్లి చేయమని గులాంనబీ చెప్పినాడని మహమ్మద్ చెప్పినాడు. నేను భగ వంతునికి ధన్యవాదాలర్పించాను. గులాంనబీఎక్కడున్నాడు?

అతనెందుకు రాలేదని ప్రశ్నించాను. అతను మాట్లాడలేక పోయాడు. హీనస్వరంతో 'గులాంనబీ మనకికలేడు'అన్నాడు కన్నపుత్రుని మరణవార్త వినగానే తల్లి కెలా వుంటుందో ఊహించు నాయనా! నాహృదయంలో వేయిబాకు లాడి నట్లయినది. నవమాసములు మోసి కన్నాను. స్తన్యపాన మిచ్చి పెంచాను. నా రక్తాన్ని, మాంసాన్ని గులాంనబీగా తయారుచేశాను. గాడిదలాగా మూటలు మోసి మోసి దిక్కులేని చావు చచ్చాడు. నేనూ ఆనాడే చచ్చాను.

ఈవార్త వినగానే జఫ్రాణిలో ఒక నూతనశక్తి ఆవిర్భవించింది. గఫూర్ విద్యావిషయంలో యింకా ఎక్కువ శ్రద్ధ తీసుకోసాగింది. ఒక్క నిముషముగూడా వృథాపోని చ్చేదికాదు. ఒక్కవారంలోనే వున్న చదువంతా చదివిం చాలనుకొన్నది. ఆమెలో ఇలాంటి ఉత్సాహోద్రేకాలు ఎందుకు కలిగినవో నేనూహించలేను. ఆమె మహమ్మదు ప్రక్కనే కూర్చుని గులాంనబీ అంతిమ ఘడియలను గూర్చి అనేక ప్రశ్న లడిగింది. 'అతనికి జబ్బు ఎప్పుడుచేసింది? మందే మైనా పుచ్చుకొన్నాడా? కూలీలందరకూ ఇలాంటి జబ్బులు తప్పకుండా వస్తుంటాయా?' 'అవును చాలామందికి వస్తుం టాయి.' అయితే తిరిగి నీపనికి నీవు పోక ఇక్కడే వున్నా వెందుకని జఫ్రాణి ప్రశ్నించింది. ఎందుకో తనకే తెలియ దన్నా డతడు.

మహమ్మద్ నాల్గురోజులు మాఇంటివద్దనే వున్నాడు. అతను వెడతాను సెలవివ్వమన్నప్పుడు నేనన్నానుగదా, 'ఆపని అంతకష్టమంటున్నావే! పోనీ విడిచిపెట్టెయ్యరాదా?

అన్నాను. 'ఏంచేయమంటావు? నాకు మరోపని చేతగాదు. ఆ పనికే మొదటినుండి అలవాటుపడ్డాను. పైగా నాకేమి జరిగినా ఏడ్చే దిక్కుగూడా లేదు.' అతను మా ఇంటిలో వున్న నాల్గురోజులలో ఒక్క చిరునవ్వు నవ్వగా చూడ లేదు. నేను 'పెండ్లి చేసుకొన్నావా నాయనా?' అనగానే నన్నెవరు చేసుకొంటారన్నాడు దీనంగా.

ఏమి టంటావు నాయనా? జఫ్రాణి వున్నదిగదా అంటావు. అదే చెప్పబోతున్నా. పొరుగువారంతాచేరిలగ్నం గూడా నిశ్చయించారు. మహమ్మదు—జఫ్రాణీలకు వివాహం జరిగి చక్కగా కాపురంచేసుకొంటూంటే నా భారం తీరి పోతుందనుకున్నాను.

పెండ్లి ప్రయత్నంలో వున్నాము. మాబోటి బీద వాళ్ళంగూడా పిల్లకాయ నత్తవారింటికి . పంపేరోజున కనీస మొక చీరో, రవికో పెట్టాలి నాయనా! పెండ్లిరోజు దగ్గర పడింది. తెల్లవారకముందే జఫ్రాణిని నిద్రలేపి స్నానం చేయించి తలదువ్వి పెండ్లిబట్టలు కట్టబెట్టాను. కాశ్మీరుసింహ మీా పరదాపద్ధతిని నిరసించినా నేను నాబిడ్డకు కాశ్మీరు శాలువ ముసుగువైచాను.

ఇంతలో తిరిగి కాశ్మీరు సింహాన్ని అరెస్టుచేసినారనే వార్త వచ్చింది. ఈనాడే అరెస్టుగావాలా?ఊరంతా అట్టుడికి పోతోంది. ఎందు కతనిని అరెస్టుచేశారని విచారించాను. ఈ దఫా అతను 'క్విట్ కాశ్మీర్' ఉద్యమాన్ని లేవదీశాడట. ఇంకెందుకు విడిచిపెడతారు. ఈ దఫా అతనిని ప్రాణాలతో విడిచిపెట్టరు.

బజారులో కోలాహలం విని మహమ్మద్ పెండ్లికి వస్తున్నట్టు భావించాను. బయటికివెళ్ళి చూతునుగదా కొంతమంది పిల్లలు నాగలిగుర్తున్న ఎఱ్ఱజండాలను చేత ధరించి "కాశ్మీర్ సింహం జిందాబాద్, కాశ్మీరు రాజా ముర్దాబాద్" అనే నినాదాలు చేసుకొంటూ పోతు తున్నారు. మా గఫూర్ కూడా ఎఱ్ఱజండా చంకనిరికించి సుద్ద ముక్క తీసికొని 'క్విట్ కాశ్మీర్' అంటూ గోడలమీద వ్రాసు కొంటూ ఊరేగింపువెంట పోతున్నాడు. జహారిణి వాకిట్లో నిలచి గొప్పవిజయాన్ని సాధించినదానివలె చూస్తోంది. ఆమె కన్నులలో ఆనందోత్సాహాలు ప్రతిఫలిస్తున్నాయి.

ఇంతలో పోలీసులారీవచ్చింది. లాటీలుతీసుకొని మోద సాగారు. అంతవరకూ గఫూర్ సుద్దతో గోడలమీద వ్రాయడం చూస్తూనేయున్నాను. కాని మరుక్షణంలో గఫూ రచ్చటలేడు. నెత్తురుముద్దయి భూమాత ఒడిలో వొరిగాడు. నేను పరుగెత్తుకొని వెళ్ళేసరికి స్పృహతప్పి పడియున్నాడు.

తల బ్రద్దలయింది. అతనిచేతిలోని సుద్దముక్క ఇంకా అలానే ఉండిపోయింది. చేతులమీద యింట్లోకి తీసికొని వచ్చాము. ఒక్కసారిమాత్రం స్పృహవచ్చింది. అతనింకా గోడమీద క్విట్ కాశ్మీర్ అని వ్రాస్తున్నట్లే భావించి క్విట్-కాశ్మీర్, అని చివరిరకారాన్ని ఉచ్చరించబోయి బొక్కెడు నెత్తురుకక్కి అనంతప్రకృతిగర్భంలో లీనమైనాడు. ఆ దృ శ్యాన్ని చూడలేక కన్నులు మూసికొన్నాను. ఇప్పటికీ ఆ దృశ్యం నన్ను కలతబెడుతూనేఉన్నది.

తామరపద్మాలులాగుండే జఫ్రాణి కన్నులు చింత నిప్పుల్లా మారిపోయాయి. ఒక్క అశ్రుబిందువుగూడా ఆమె కన్నులవెంటరాలేదు. అందరనూ తిరుగకూడగట్టుకొని ఊరేగింపు బయలుదేరదీసింది. ఊరేగింపుకుముందు ఆడవాండ్లు నడచుచున్నారు. ఊరేగింపు నిశ్శబ్దంగా ముందుకు సాగిపోతున్నది. జఫ్రాణి పెండ్లికుమార్తె దుస్తుల్లో. కాని కన్నులు అగ్నిగోళాలు. ఊరేగింపు పోలీసులారీని సమీపిస్తున్నది.

కాకీదుస్తులు, పెద్ద పెద్దమీసాలు, మొరటు దేహాలు తుపాకులు సరిజేశాయి. ఒకటి...పది యిరవై బారులు, రెండు తుపాకిగుండ్లు జఫ్రాణి రెండుకన్నులలోనుండి దూసుకుపోయాయి. జఫ్రాణి వక్షస్థలంపై చేయిపెట్టుకొని యిదిగో యిక్కడ నేలకు ఒరిగింది. నేను ఆమెవద్దకుపోయి చూచేసరికి ఆమె వక్షస్థలంనుండి రక్తం ప్రవహించి యీ నేలకు జేగురురంగు...రక్తం. ఒక స్త్రీవక్షస్థలంనుండి అమృతమునకు మారు అసృగ్ధారలు. భూమాత రక్తదాహాన్ని తీర్చుకొన్నది! ఆఖరిక్షణంవరకు ఆమె ముఖంలో చిరునవ్వు చిందులాడుతూనే ఉన్నది. ఆమె ఒక్కసారి బరువుగా కన్నులెత్తి 'అమ్మా! ఇదే నాపెండ్లి' అని చివరిసారిగా కన్నుమూసింది.

అప్పటినుండే కుంకుమ పూవునకు యీ ఎఱ్ఱదనం నాయనా! ఇదీకథనాయనా. ఏమిటంటావ్. వెడతానంటావా నేను మొదటనే చెప్పలేదూ,— కొంచెంసేపట్లో నీకారు బాగవుతుంది. నీ దారిన నీవు వెళ్ళిపోతావు, నాకథ ఇక్కడే

నిలచిపోతుందని. నిత్యమూ యీరోడ్డువెంట కారు లిలానే పరుగిడుతుంటాయి—వందలు, వేలు. వారూ నీలాగే ఓక క్షణమాగి తరువాత దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోతారు. కోతకోసేవరకు యీకుంకుమపూ విచ్చుటనే ఉండిపోతుంది. పంటకొచ్చిన తరువాత కోసి ప్రపంచం నలుమూలలకూ పంపుతాము. మనదేశంలోనేగాక విదేశాలలోగూడా వారి వారి ఆహారపదార్థలలో వేసిన యీ కుంకుమపూవాసనలకు ముగ్ధులై కుంకుమ పూవునకు యీ ఎఱ్ఱదనం, వాసన ఎలా వచ్చినవని ప్రశ్నిస్తారు. ఎవరు చెప్పగలరు? ప్రపంచంలో నాకు వినా మరొకరికీ సంగతి తెలియదు.

# విశ్వవిఖ్యాత నవలలు

| | | |
|---|---|---|
| నవజీవనము | టాల్‌స్టాయ్ | రు. 6-0-0 |
| సంసార సుఖం | ,, | 1-8-0 |
| ముగ్గురు మిత్రులు | గోర్కీ | 5-0-0 |
| అమ్మ | ,, | 5-0-0 |
| మానవుడు | రోమారోలా | 5-0-0 |
| బీజలక్ష్మి | పెరల్ బక్ | 2-8-0 |
| తూర్పుపడమరలు | ,, | 2-0-0 |
| యమకూపం | కుప్రిన్ | 3-8-0 |
| పేకమేడలు | టర్జినీవ్ | 2-0-0 |
| రూడిన్ | ,, | 2-8-0 |
| నానా | ఎమిలీజోలా | 2-8-0 |
| జనపవాదాలు | జాక్ లండన్ | 4-0-0 |
| బడిపిల్లలు | నోసోవ్ | 2-0-0 |
| నిరంజన్ | రవీంధ్రనాథ మైత్రా | 2-0-0 |
| స్వేచ్ఛాపథము | హోవార్డుఫాస్టు | 5-0-0 |

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాలు పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RSK01A176 |
| పుస్తకం పేరు | అజ్ఞాన కథలు |
| తారీఖు | 3/6/2023 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | CI/1,17 |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | S.C.B.K |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసినది | CHAITHANYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | |
| పరిస్థితి | |